72 ఏప్రిల్ 31

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక





నిర్వహణ
'సాహితీ మిత్రులు'

4 పేజీలు 1 రూపాయి

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

**31**

ఏప్రిల్ 1972

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

74 పేజీలు

1 రూపాయి

ప్రతులకు, వివరాలకు :

సృజన

హనుమకొండ

వరంగల్–1 ఆం. ప్ర.

విడిప్రతి : ఒక రూపాయి

అర్థ సంవత్సర చందా : ఆరు రూపాయలు

సంవత్సర చందా : పది రూపాయలు

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh Hyderabad. Wide Re. No. 182/A4/67, dated 22—9—1967.

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayamu,
J. P. N. Road, Warangal-2 (A.P.)

# విప్లవ సాహిత్యం - వీరయ్యలు

అతడు మధుసాహిత్యాన్ని అమ్మలేదు. టీ దుకాణం పేరుమీద సారా బుడ్డీలు అమ్మలేదు. అమ్మాయిల వ్యాపారం చేయలేదు. పత్రికలు, పుస్తకాల చాటున సట్టాబజార్ నడపలేదు. చల్లనీళ్ళకు వేడినీళ్ళ తోడుగా చాయ్ తోపాటు విప్లవ సాహిత్యాన్ని అమ్ముతున్నాడు. ఆ అమ్మకోవడం కేవలం వ్యాపార దృష్టితోకాక ఒక కమిట్‌మెంట్‌తో ఒక కర్తవ్యంగా చేస్తున్నాడు. విప్లవ సాహిత్యానికి, అది కోరుతున్న ప్రజలకు మధ్యన వంతెనగా పనిచేస్తున్నాడే గాని మరేరకమైన దోపిడీ వ్యవస్థకు దళారీగామాత్రం పనిచేయడం లేదు.

...నేషన్ పత్రికలు తాటికాయంత అక్షరాలతో రావులకు, బాబులకు—శ్రీలకు, కుమారీలకు మధ్యన నడిచాయని చెప్పే కామక్రీడలను ఆయన దుకాణానికి తోరణంగా కట్టకపోవడమే ఆయన చేసిన నేరం, పైన చెప్పిన యీ వ్యవహారాలన్నీ పోలీసులకు అలవాటు. (పైగా కొన్ని మామూళ్ళను ఆనవాయితీగా తెచ్చిపెట్టే లాభసాటి బేరాలు) ఆ అలవాట్లకు, సంప్రదాయాలకు భిన్నంగా 'ఎన్నికలను బహిష్కరించండి' అని విప్లవ రచయితలు చెప్పిన మాటలు బోర్డుమీద రాసిపెట్టిన నేరానికి అతణ్ణి... ఖమ్మంలో టీతో పాటు విప్లవ సాహిత్యాన్ని అమ్ముతున్న బి. వీరయ్యగారిని (చూడండి సాహిత్య లేఖలు, పే. 60) పోలీసులు అమానుషంగా హింసించారు.

వీరయ్యను విప్లవకవులు వచ్చి రక్షించుకోవచ్చు, రక్షించుకోలేకపోవచ్చు: (ఇప్పటికి ఎంతమంది వీరయ్యలను నిష్కారణంగా, దారుణంగా అడవుల్లో కాల్చి చంపలేదని) కాని వీరయ్యలను, విప్లవ కవులను, అడవుల్లో (ఊళ్ళల్లో, నగరాల్లోకూడ) అన్యాయంగా కాల్చి చంపబడుతున్న అజ్ఞాత యోధులను- అందరినీ విప్లవ చైతన్యం వికసించే ప్రజలే కాపాడుకుంటారు. అప్పుడు ఆ విశ్వవ్యాపిత శ్రామిక విప్లవ సంగ్రామంలో ఖమ్మం పోలీసు బలంగాని జులుంగాని ఏం లెక్క!

ఆ రోజులు వీరయ్యలే తెస్తారు. — సంపాదకుడు

# ఎన్నికలు-రాజకీయపార్టీలు- ఒకనిష్పాక్షికఎన్నికల పరిశీలన

ఎ. రంగారావు

ఎన్నికలు జరిగేయి. కాంగ్రెస్ బ్రహ్మాండమైన విజయం పొందింది. మళ్ళీ 5 ఏళ్ళవరకూ ఎన్నికలనే గొడవలేకుండా అయింది ప్రజలకు. ప్రస్తుతం పరిపాలిస్తున్న వారే 5 ఏళ్ళవరకూ మళ్ళీ యధేచ్ఛగా పాలనకొనసాగిస్తారు.

ఈ ఎన్నికల్లో ఏయే పార్టీలు పాల్గొన్నయ్? ఎవరేమి చెప్పారు? ఎవరెలా నడిచారు? అసలు ఫలితం ఏమిటి? పర్యవసానం ఎలా వుంటుంది. మనం ప్రజలం గుర్తించవలసింది ఏమిటి? ఏమి పాఠాలు నేర్చుకోవాలి?

ప్రజలు ఎలా పాల్గొన్నారు? ఎందరు పాల్గొన్నారు? ప్రజలు యీ ఎన్నికలను ఎలా స్వీకరించారు? ప్రజలకు– యీ ఎన్నికలకు ఎంతవరకు సంబంధం వుంది? ఇవీ ముఖ్యమైన, అసలు ఆలోచించవలసిన సమస్యలు సమాధానం దొరకాల్సిన ప్రశ్నలు.

వివిధ రాజకీయపార్టీలు చాలా చెప్పాయి. కొన్నిరాష్ట్రాల్లో అధికారం కొరకు పోటాపోటీలు జరిగినయ్.

దేశంలోవున్న అన్నిరాజకీయ పార్టీలు ఎన్నికల్లో చురుకుగా పాల్గొన్నయ్. తమ తమ బలాలన్నీ కేంద్రీకరించి ప్రజలను ఓటింగ్‌కు సమీకరించినయ్. అన్నిరాజకీయ పార్టీలు ఎన్నికలకు చాలా ప్రాధాన్యత నిచ్చి ప్రజలకు మంచిచేయటానికే కృషి చేస్తామన్నారు. ఈ ఎన్నికల్లో పాల్గొనవద్దని, వీటిలో న్యాయమూ నీతీలేవని ఎన్నికల్లో ఎవరుగెల్చినా జరిగేది, జరిగేది ప్రజలకేమీలేదని చెప్పింది కొద్దిమందిమాత్రమే. అదీ బహుళా ప్రజానీకంలో ఎక్కడోతప్ప విన్పించి వుండదు.

ఇన్ని రాజకీయపార్టీలు, ఇంత చురుకుగా పనిచేసినా మొత్తం ప్రజలలో సగం మంది ఓటువేయలేదు. సగం మందికి ఎన్నికల యెడలనూ, ఆయా పార్టీలయెడలనూ ఏమీ ఉత్సాహంకాని, సదభిప్రాయంగాని లేవు. అలా ఏమాత్రం వున్నా వారేవచ్చి ఓటు వేశేవారు.

వచ్చి ఓటువేసిన సగం మందిలో ఎంతశాతం రాజకీయ పక్షాలవాళ్ళ మొహమాటమూ వత్తిడివల్ల వచ్చారో సరిగా అంచనా వేయలేకపోవచ్చుకాని కొంత శాతమైనా అలా యిష్టాయిష్టాలతో సంబంధంలేకుండా పరిస్థితులవల్ల వచ్చినవాళ్ళు వున్నారు అనేది అందరూ అంగీకరించాల్సిన విషయమే. కార్లు, బళ్లూ, రిక్షాలూ వగైరా సర్వసాధనాలతో అనేక రాజకీయపక్షాల వందలాది వేలాది కార్యకర్తలు ఇంటింటికీ తిరిగి ఓటర్లను తీసుకొస్తుంటే రాకుండా వుండేందుకు కష్టమయిన విషయం: యిష్టం వున్నా లేకున్నా.

వివిధప్రాంతాల్లో దొంగ ఓట్లు వేయటమో, ఓటర్లు రాకున్నా తమతమ అను కూలతలను బట్టి అక్కడక్కడా పార్టీల కార్యకర్తలే ముద్రలుగుద్ది బేలట్ పెట్టెల్లో వేయటం లాంటివి కొంతశాతం ఓట్లు వుంటయ్యనేది దాదాపు అన్నిపార్టీల పరస్పర విమర్శల్లో వినవచ్చేది.

ఈ రెండు విషయాలూ పరిగణనలోనికి తీసుకున్నపుడు నిజంగా ఓట్లు వేసిన ప్రజల సంఖ్య 50 శాతంకంటే తగ్గిపోయి, నూటికి 25, 30 మంది ప్రజలే ఎన్నికల్లో పాల్గొన్నట్టు రుజువవుతుంది. ఇది ఎవరూకాదనే వీలులేని సంగతి.

ప్రజానీకానికి ఎన్నికలగురించి పాల్గొన్న పార్టీలగురించి మంచి అభిప్రాయమో, ఆశలోలేనట్లు (చాలా మెజారిటీకి) యీ అంకెలు వాస్తవాలు రుజువు చేస్తున్నయ్. ఎవరో చెబితేవిని కాకున్నావినే అయినా ఎలాగయినా ప్రజల్లో ఎక్కువశాతం ఎన్నిక లకు దూరమైనారు. ఎన్నికల్లో పాల్గొన్న పార్టీలన్నిటికీ కలిపి ప్రజల్లో నూటికి 25, 30 వంతులకే అభిమానమున్నట్లూ, పూర్తి మెజారిటీ ప్రజలకు అయిష్టం అన్నట్లు మనకు రుజువవుతున్నది.

ఎన్నికలను బహిష్కరించాలని అన్నవారు ప్రచారం చేసినవారు కొద్దిమందే అయినా వారే ప్రజాభిప్రాయానికి అనుకూలంగా ప్రజలతోవున్నట్లు ఏపార్టీకంటే వారే ప్రజాభిప్రాయ ప్రతినిధులన్నట్లు రుజువు చేసినయ్ యీ ఎన్నికలు.

నూటికి 20 మంది ప్రజల అభిప్రాయమే ప్రజాభిప్రాయంగా అది పొందిన పక్షము పరిపాలనే ప్రజా పరిపాలనగా ముద్రవేస్తున్న ఎన్నికలు యివి అని ఫలితాలు తెలుపుతున్నయ్.

అధికారంలోవుండి, డబ్బుకలిగి, పోలీసు, ఆఫీసర్ల వర్గమూల అండదండలు, అదుపు ఆజ్ఞలతో అత్యల్పసంఖ్య ప్రజాబలంతో ఎన్నికవుతున్న ప్రభుత్వాలు యివని తేలిపోతున్నది.

ప్రతిపక్షాలనుకోబడే పార్టీలకు ప్రజలలో ఏమీ బలంలేదని, పైగా చాలావరకూ ప్రజలు యీ రకరకాల మితవాద, అతివాద పార్టీలనూ, దేశభక్తి దగ్గర్నించి, మార్క్సిజం వరకూ జపిస్తూ, సిద్ధాంత రాద్ధాంతాలను వల్లెవేస్తున్న యీ అన్నిరాజకీయ పార్టీలను ప్రజలు పూర్తిగా తిరస్కరించుతున్నారనేది యీ ఎన్నికలవల్ల తెలుస్తోంది.

"ఎవరూ అధికారాన్ని వదలుకోరు
బలంతో కూలదోస్తే తప్ప."

# కళావేత్తలారా! మీరేవైపు?

మాగ్జింగోర్కీ

(గత సంచిక తరువాయి)

## శ్రామికవర్గ నియంతృత్వం

"మీ దేశంలో ఏర్పడిన శ్రామికవర్గ నియంతృత్వం రైతులపై బలప్రయోగంగా పరిణమిస్తుంది అని అనేకమంది ఇతరులతోపాటు మేంకూడా అభిప్రాయపడుతున్నాం" అని మీరు వ్రాస్తున్నారు. ఈ సందర్భంలో నేను మీకొక సలహా ఇస్తాను. 'అనేక మంది ఇతరులతోపాటు' కాకుండా మీరు మార్క్సిజాన్ని లెనినిజాన్ని అంగీకరించే మేధావులతోపాటు - వారు సంఖ్యలో కొద్దిమందే అయినా కలిసి ఆలోచించండి. మార్క్సిజం- లెనినిజం ఒక్కటే అత్యున్నత శాస్త్రీయసిద్ధాంతం. ఆ సిద్ధాంతంద్వారానే నిజమైన సాంఘికన్యాయం నెలకొంటుంది. నూతన కళాస్వరూపాలు స్వేచ్ఛగా అభివృద్ధి చెందుతాయి. కొంచెంసేపు మీరు మీవర్గ సంబంధాలను మరచిపోయి వాస్తవిక విషయాలను పరిశీలించండి. మీరు సంబంధబాంధవ్యాలు నెరపే పెట్టుబడిదారీవర్గ చరిత్ర అంతా కష్టజీవులైన ప్రజాసామాన్యంపై నైతికంగా శారీరకంగా చేసిన-చేస్తూన్న హింసాకాండ చరిత్రే. ఈ విషయాన్ని మీరు సరిగా అవగాహన చేసుకోగలిగితే మీ వర్గమే మీకు శత్రువని తెలుసుకుంటారు. కార్ల్‌మార్క్స్ గొప్ప ప్రతిభావంతుడే. అంతమాత్రాన ఆయనను బృహస్పతి నోట్లోనుంచి ఊడిపడిన సరస్వతీదేవి అనుకోగూడదు. తమ తమరోజుల్లో న్యూటన్, డార్విన్‌లు ఏవిధంగా నూతనశాస్త్రీయ సిద్ధాంతాలను కనిపెట్టారో అదేవిధంగా కార్ల్‌మార్క్స్ కూడా అనుష్ఠాన పూర్వకమైన శాస్త్రీయ ప్రయోగాల ద్వారానే ఈనాటి విషయాలను సిద్ధాంతీకరించాడు. మార్క్స్‌లాగే లెనిన్‌కూడా గొప్ప ప్రతిభావంతుడు. మార్క్సిజాన్నే లెనిన్ ఇంకా స్పష్టంగా సుబోధకంగా విప్పిచెప్పాడు. ఈ ప్రబోధకు లిద్దరూ ప్రప్రథమంగా మీరేవర్గానికి సేవచేస్తున్నారో తెలియ చెప్తారు. తన స్వార్థసిద్ధికోసం ఈ పెట్టుబడిదారీవర్గం ఏవిధంగా అబద్ధాలపైనా వంచనపైనా అమానుష హింసాకాండపైనా రక్తపాతంపైనా ఆధారపడి ఈ 'సంస్కృతి'ని నిర్మించిందో మీకండ్లకు గట్టేటట్టు చూపుతారు. ఈ 'సంస్కృతి' ఇప్పుడేవిధంగా పతనమై క్షీణించిపోతూ ఉందో మీకు బోధపరుస్తారు.

## హింస

ఇక హింసను గురించి కొంచెం మాట్లాడుదాం. శ్రామికవర్గ నియంతృత్వం అనేది ఒక తాత్కాలిక పరివర్తనదశ మాత్రమే. బూర్జువా ప్రభుత్వానికి ఇంతకాలం

నుంచి బానిసలుగా ఉన్న కోట్లకొలది ప్రజలను దేశానికీ, దేశంలోని సిరిసంపత్తికీ వారినే నాయకులుగా తయారుచేయడం కోసం ఈ తాత్కాలికదశ అవసరం అవుతుంది. ఆర్థికంగా, రాజకీయంగా కష్టజీవులైన ప్రజలందరికీ, రైతాంగమంతటికీ సమాన ప్రాతిపదిక ఏర్పడిన వెంటనే- సంఘంలోని ప్రతిసభ్యునికీ శక్తికొలదీ పని చేయడానికీ అవసరమైనంత తీసుకోడానికీ అవకాశం లభించిన వెంటనే- శ్రామికవర్గ నియంతృత్వం యొక్క అవశ్యకత లేకుండా పోతుంది. 'తదితరు లనేకమంది'తో పాటు మీరుకూడా 'హింస' (వైలెన్సు) అనేమాటను తప్పుడర్థం చేసుకుంటున్నారు. సోవియట్ యూనియన్ కార్మికవర్గంగానీ కమ్యూనిస్టుపార్టీగానీ హింస చేస్తుందని మీరు వినేమాటలన్నీ అసలు చాలావరకు సర్వాబద్ధాలు. సోవియట్ యూనియన్‌లో నేడు జరుగుతూ ఉన్న ఒక నూతన సాంఘికపరిణామానికే కార్మికవర్గశత్రువులు 'హింస'అనే పేరుబెట్టి సోవియట్ సంస్కృతిని, సోవియట్ ఆర్థికవిధానాన్ని అప్రతిష్ఠపాలుచేయాలని ప్రయత్నిస్తున్నారు.

'నిర్బంధం' అనే విషయాన్ని గురించి అయితే మాట్లాడడం సాధ్యమవుతుంది. నిర్బంధానికీ హింసకూ చాలాతేడా ఉంది. పిల్లలను నిర్బంధంగా చదివించడమంటే హింసను ప్రయోగించడ మవుతుందా? అదేవిధంగా సోవియట్ యూనియన్ కార్మిక వర్గం, ఆ వర్గపార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీ రైతులకు సాంఘిక రాజకీయ 'ఓనమాలు' నేర్పుతూ ఉంది. 'సుత్తికీ నాగలికీమధ్య' బుద్ధిజీవులైన మీజీవిత నాటకాన్ని మలచడానికి, దిద్దడానికి మీకుకూడా మరొకరు సాంఘిక రాజకీయ 'ఓనమాలు' నేర్పుతూనే ఉన్నారు. కాని ఈ 'మరొకరు' నేనుమాత్రం కాదు.

## రైతుల కర్తవ్యం

పరాన్న భుక్కులూ, దోపిడివర్గమూ తయారుకావడానికి రైతాంగమూ, లక్షల కొలదీ ఉన్నతదితర కొద్దిపాటి ఆస్తిపరులూ, అనుకూల వాతావరణాన్ని సృష్టిస్తున్నారు. ఈ వాతావరణం నుంచే సర్వ దుర్గుణ సమ్మిళితమైన పెట్టుబడిదారీ విధానం ఉత్పన్నమవుతూ ఉంది. రైతుల శక్తిసామర్థ్యాలన్నీ, ఆ బారెడు ముక్కను సాగుజేయడంలోనే సమాప్తమవుతున్నాయి. లక్షాధికారుల్లాగే ఈ రైతాంగంకూడా అజ్ఞానావృతమై ఉంది. విజ్ఞానాన్ని ఆర్జించడానికి నేడు వారికెలాంటి అవకాశాలూ లేవు. బుద్ధిజీవులైన మీరు ఈ యథార్థ విషయాన్ని గమనించే ఉంటారు. కనీసం ఊహించగలిగి అయినా ఉంటారు. నవంబరు విప్లవానికి పూర్వం రష్యారైతుల స్థితిగతులు 17వ శతాబ్దంనాటి పరిస్థితుల కంటె ఏమాత్రం బాగాలేవు. రష్యాలో సోవియట్ ప్రభుత్వం ఏర్పడింది అనేకోపంతో

విదేశాలకు వెళ్ళి తలదాచుకుంటూన్న దోపిడిముఠాకు చెందిన రష్యన్లుకూడా ఈ యదార్థాన్ని కాదనలేరు.

అనాగరికదశలో రైతులు ఎంతోకాలం ఉండరు. ధనికరైతుల, భూస్వాముల జమీందారుల వలలో రైతులు పడగూడదు. చారెడు చారెడు ముక్కలుగా చీలిపోయిన కొద్దిపాటి భూమిని సాగుజేసుకుంటూ శిక్షబడ్డ ఖైదీల్లాగా రైతులు తమ జీవితాన్ని గడపరాదు. భూమితో ఎట్టి సంబంధం లేకుండా, ఎన్నడూ భూములను బలపరచకుండా ఉండే సోమరిపోతులైన భూస్వాములకు తాము చెమటోడ్చి రెక్కలు ముక్కలు చేసుకొని పండించిన పంటలో కొంతభాగాన్ని సమర్పించుకొని ఆర్థాకలితో నకనకలాడుతూ రైతులు ఏస్తులు పండుకోవడం తగదు. మతసంస్థలనూ పెట్టుబడిదారీ విధానాన్నీ బలపరచే మాల్థస్ తప్పుడు సిద్ధాంతానికి రైతులు తలవంచగూడదు (ఆహారోత్పత్తికంటె సంతానోత్పత్తి వేగంగా జరుగుతూ ఉందనీ, నేటి పేదరికానికి కారణం జనాభా పెరుగుదలేకాని పెట్టుబడిదారీ విధానం కాదనీ మాల్థస్ సిద్ధాంతం- అనువాదకుడు) తమ స్థితి నానాటికి దిగజారి ఏవిధంగా అధ్వాన్నమైపోతూ ఉందో రైతులు స్వయంగా గ్రహించలేని పక్షంలో కార్మికవర్గం నిర్బంధంగానైనా వారిలో ఈ చైతన్యాన్ని కలిగించవలసి ఉంటుంది. అయినా సోవియట్ యూనియన్‌లో ఈనిర్బంధంతో అవసరం లేకుండానే పనిసాఫీగా జరిగిపోతూ ఉంది.

1914-1918 ప్రపంచ యుద్ధఫలితంగా రష్యా రైతులు అనేక కష్టనష్టాలకు గురి అయ్యారు. నవంబరు విప్లవం వారిలో ఒక నూతన జీవంపోసింది. ఒక నూతన చైతన్యం కలిగించింది. సోవియట్ రైతు అజ్ఞానాంధకారం నుంచి బైటపడ్డాడు. తన మంచి చెడులను తానే ఆలోచించుకోగల స్థితిలోకి వచ్చాడు. రైతులకు కావలసిన యంత్రాలూ ఎరువులూ వగైరాలను ప్రభుత్వమే సప్లయి చేస్తూవుంది. విజ్ఞానాన్ని ఆర్జించడానికి అనేక అవకాశాలు లభ్యమయ్యాయి. ప్రతి సంవత్సరం అనేకవేలమంది రైతుబిడ్డలు ఇంజినీర్లుగానూ, ఆర్థిక శాస్త్రవేత్తలుగానూ, డాక్టర్లుగానూ ఉత్తీర్ణులై నూతన జీవితం ప్రారంభిస్తున్నారు. కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన సోవియట్ కార్మికవర్గం సోవియట్ యూనియన్‌లో ఒకే ఒక యజమానిని - 16 కోట్ల తలలూ, 32 కోట్ల చేతులూ కలిగిన ఒకే ఒక యజమానిని - సృష్టించేందుకు (అంటే ప్రజలనే నాయకులుగా తయారుచేసేందుకు - అను) పోరాడుతూవుందని రైతులు గ్రహించసాగారు. ఈ విషయాన్నే రైతులు పూర్తిగా అర్థం చేసుకోవలసి వుంటుంది. సోవియట్ యూనియన్‌లో జరుగుతూన్న ప్రతిపనీ కొద్దిమంది ధనికులకోసంగాక ప్రజలందరికోసం

ప్రజలందరి శ్రేయస్సుకోసం- జరుగుతూవుందని సోవియట్ రైతులు స్పష్టంగా చూడగలుగుతున్నారు. సోవియట్ యూనియన్‌లో స్థాపించబడిన 26 వ్యవసాయ శాస్త్రపరిశోధన సంస్థలూ భూసారాన్ని అభివృద్ధిచేయడానికీ, తమ రెక్కలకష్టాన్ని తగ్గించడానికీ, ఊపిరి సల్పకుండా ఏవిధంగా కృషిచేస్తున్నాయో, ఎందుకోసం కృషి చేస్తున్నాయో, సోవియట్ రైతు నేడు స్పష్టంగా అర్థం చేసుకుంటున్నాడు.

శతాబ్దాలనుంచీ తాను నివసిస్తోన్న ఆమురికి కూపాల్లోనే ఇంకాపడి ఉండాలని రైతుకోరడంలేదు. పాఠశాలలూ, కళాశాలలూ, నాట్యశాలలూ, వైద్యశాలలు, క్లబ్బులు గ్రంథాలయాలూ, సినీమాలతో నిత్యం కళకళలాడే వ్యవసాయికనగరాల్లో నివసించాలని రైతు తహతహలాడుతున్నాడు. రైతుల్లో జ్ఞానపిపాస దినదిన ప్రవర్ధమానమవుతూ ఉంది. సాంస్కృతిక జీవితంపై అభిరుచి పెరుగుతూ ఉంది. సోవియట్ రైతులు ఈ విషయాలను గ్రహించక పోయినట్లయితే, సోవియట్ రైతాంగం హృదయపూర్వకంగా తన సంపూర్ణ సహకారాన్ని అందించకపోయినట్లయితే గత 15 సంవత్సరాల్లో సోవియట్ కార్మికవర్గం ఇంతటి మహత్తర విజయాలను సాధించగలిగి ఉండేదేకాదు.

బూర్జువా ప్రభుత్వాలు తమ దేశాల్లోని కార్మిక ప్రజలను ఒక గ్రుడ్డి యాంత్రిక శక్తి (మెకానికల్ ఫోర్స్)గా తయారుచేస్తాయి. అందువల్ల వారు తమ శ్రమయొక్క సంస్కృతీ ప్రాముఖ్యతను గుర్తించలేరు. మీదేశాల్లో ఆర్థికసంస్థలూ ఆర్థిక సంఘాలూ అనేకం ఉన్నాయి ఇవన్నీ జాతీయ శక్తులను దోపిడీచేసేవే, కష్టజీవులైన ప్రజలపై పరాన్నభుక్కులైన సోమరిపోతులను ఎక్కించేవే. దోపిడీలో భాగాలకోసం వీళ్ళు తమలో తాము పోట్లాడుకుంటూ ఉంటారు. ఒకళ్ళను ఒకళ్ళు నాశనం చేసుకోడానికి డబ్బుతో చెలగాట మాడతారు, అనేక కపటనాటకాలు ఆడుతారు. ఇవన్నీ ఈనాటి విపరీతమైన ఆర్థిక మాంద్యానికి దారితీశాయి. కోట్లకొలది ప్రజలు ఆకలి మంటలతో అలమటించి పోతున్నారు బుద్ధిపూర్వకంగా బూర్జువా ప్రభుత్వాలు ప్రజారోగ్యాన్ని మంటగలిపేస్తున్నాయి. శిశుమరణాల సంఖ్య రోజురోజుకు పెరిగిపోతూ ఉంది. ఆత్మహత్యలు అధికమవుతున్నాయి. సంస్కృతికి మూలశక్తియైన మానవశక్తి శుష్కించి నీరసమై పోతూఉంది. ఇంత జరుగుతున్నా మీ అధికారవర్గానికి చీమకుట్టినట్లయినా లేదు. నిరుద్యోగులకు సహాయంచేసే నిమిత్తం 37½ కోట్ల డాలర్లను ప్రత్యేకించాలని ప్రతిపాదించిన లా ఫోలెట్ - కాస్టిగన్ బిల్లును మీ సెనేట్ త్రోసిపేసింది. 1930 లో 153, 731 మందినీ, 1931 లో 198, 738 మందినీ నిరుద్యోగింపల్ల అద్దె చెల్లించలేని కారణంగా

న్యూయార్కులో ఇండ్లనుంచి బైటికి వెళ్ళగొట్టినట్లు, 'న్యూయార్క్ అమెరికన్' అనే పత్రిక ప్రకటించింది.

1932 జనవరిలో ఈ విధంగా న్యూయార్కులో ప్రతిరోజూ వందల మందిని బైటికి వెళ్ళగొట్టడం జరిగింది.

ఇక సోవియట్ యూనియన్‌లోనో? ఆర్థికవిధానమూ, శాసనవిధానమూ రెండూ కార్మికవర్గం చేతుల్లోనూ— వ్యక్తిగత ఆస్తిని నిర్మూలించవలసిన ఆవశ్యకతనూ పొలంపనిని సాంఘికమూ యాంత్రికమూ పారిశ్రామికమూ చేయవలసిన ఆవశ్యకతనూ గుర్తించినటువంటీ, ఫ్యాక్టరీల్లోను తదితర పరిశ్రమల్లోనూ పనిచేసే కార్మికుల మానసిక స్వభావాన్ని అలవరుచుకున్నటువంటీ— రైతులచేతుల్లోనూ ఉన్నాయి. సమిష్టివ్యవసాయ క్షేత్రాల్లో పనిచేసే వారిసంఖ్యా, కమ్యూనిస్టుల సంఖ్యా రోజురోజుకు అధికమవుతూ ఉంది. బానిసత్వావశేషాలనుంచీ, మతదాస్యం నుంచీ, మూఢవిశ్వాసాలనుంచీ పూర్తిగా బైటబడినకొలదీ ఈసంఖ్య ఇంకా అతిశీఘ్రంగా అభివృద్ధి చెందుతుంది.

సోవియట్ యూనియన్‌లో చట్టాలు పైనుంచిగాక క్రిందినుంచి - కష్టజీవులైన ప్రజలనుంచి - రూపొందుతూ ఉంటాయి. ప్రత్యక్షజీవిత ప్రవాహంనుంచే అవి పైకి ఉబుకుతాయి. కార్మికుల రైతుల శ్రమజీవితంలో కాకలుతీరి నిగ్గుదేరినవాటినే సోవియట్ ప్రభుత్వం చట్టంచేస్తుంది. కష్టజీవుల కేంద్ర నిర్మాణానికి సంబంధించినంతవరకు పార్టీ ఒక నియంతయే. సమస్త ప్రజాసమూహంలో ప్రతివ్యక్తికి తనశక్తి సామర్థ్యాలను అభివృద్ధి చేసుకునేందుకు తగినంత సంపూర్ణావకాశాన్ని కలిగించి శారీరికశక్తినంతా బౌద్ధిక శక్తిగా మార్చడమే పార్టీ ఆశయం.

## అరాచక సిద్ధాంతాలు

వ్యక్తిత్వానికి ప్రాధాన్యత ఇవ్వాలి అని గొంతుచించుకుంటూ కేకలువేసే బూర్జువా ప్రభుత్వాలన్నీ తమ ప్రయోజనాలకూ, తమ సాంప్రదాయాలకూ అనుగుణంగా యువకులకు తర్ఫీదునిస్తాయి. అవును, ఇదిసహజమే. ఈ బూర్జువా సమాజంలో నవయువకుల్లోనే అరాచక సిద్ధాంతాలు తలఎత్తుతూ ఉన్నాయి, ఇది ఒక అస్వాభావిక లక్షణం. హద్దూపద్దులేని వ్యక్తిస్వాతంత్ర్యం ఫలితంగా సమాజం మొత్తం నాశనమయ్యే కల్మష పూరిత వాతావరణానికి ఈ అస్వాభావిక లక్షణము ఒక నిదర్శనం. ఈ అస్వాభావిక లక్షణాలను గురించి మీ యువకులు ఊహాగానం చేయడమేకాకుండా వాటిని ఆచరణలో

కూడా పెడుతున్నారనే విషయం మీరు బాగా ఎరుగుదురు. ఉభయఖండాల్లోను యువకులుచేసే 'కుచేష్ట'లను గురించి, యూరోపియన్ పత్రికలు అదేపనిగా రిపోర్టులపై రిపోర్టులు ప్రకటిస్తున్నాయి. ఈ 'కుచేష్టలు'– అపరాధాలు- భౌతికావశ్యకత ఫలితంగా జరిగేవికావు. 'జీవితంలోని విసుగుదల' ఫలితంగా కొత్తదనంకోసం విషయలంపటత్వం కోసం జరిగేవి. వ్యక్తిత్వాన్ని, మానవజీవితాన్నీ అతిహీనదృష్టితో చూడడమే ఇందుకు మూలకారణం. కార్మికుల్లోనుంచి, రైతుల్లోనుంచి పతనమైన కొందరు 'నాయకులను' బూర్జువావర్గం తనలో చేర్చుకొని వారిద్వారా తనప్రయోజనాలను సాధించుకోజూస్తుంది. ఇలాంటి నాయకులు వ్యక్తిగతంగా తమస్వార్థాన్ని ఆశించి బూర్జువావర్గం చేతుల్లో కీలుబొమ్మల్లాగా తయారై వారాడించిన అబద్ధాలన్నీ జంకూకొంకు లేకుండా అడతారు. కార్మిక కర్షకవర్గాలకు ద్రోహంచేస్తారు. యూరోపియన్, అమెరికన్ సాహిత్యంలో పూర్తిగా బూర్జువావర్గాన్ని నిలబెట్టేందుకు అనేక విఫలప్రయత్నాలు జరుగుతున్నాయి. బూర్జువాచరిత్ర అంతా ఆవర్గంయొక్క మానసిక దివాలాకోరుతనాన్ని వెల్లడించేచరిత్రే. బూర్జువావర్గంలో ఈనాడు గర్వించదగిన సుగుణాలేమీలేవు. హిట్లరులాంటి యుద్ధోన్మాదకుల వెల్లడించే యుద్ధావేశాలూ, జాతిద్వేషాలూ మినహా ఆవర్గానికి మరేగర్వకారణంలేదు.

సోవియట్ప్రజలు నేడొక నూతన విజ్ఞానయుగంలో ప్రవేశిస్తున్నారు. నవంబరు విప్లవం లక్షలకొలది ప్రతిభావంతులను క్రియాశీలురుగా చేసింది. కాని కార్మికవర్గాశయాలన్నిటినీ సాధించడానికి వారుమాత్రమే చాలరు, ఇంకా చాలామందిని తయారు చేయవలసి ఉంటుంది. చేస్తూఉంది. సోవియట్ యూనియన్‌లో నిరుద్యోగ సమస్య అంటూ లేనేలేదు. ప్రతిక్షేత్రంలో- ప్రతిరంగంలో- మహత్తర విజయాలను సాధించడానికి ఇంకా ఎందరో అవసరం.

ఓ మేధావులారా! కళావేత్తలారా! కార్మికవర్గం రాజకీయాధికారాన్ని తనహస్తగతం చేసుకోడంతో మీ సృజనాత్మక కృషికి ఎన్ని మహత్తర అవకాశాలు లభిస్తాయో ఇప్పటికైనా గుర్తించే ఉంటారు.

రష్యా మేధావివర్గానికి చరిత్ర ఎంతటి కఠోరపాఠాన్ని నేర్పిందో ఒకసారి పరికించండి! తమ కష్టజీవులైన ప్రజలతో భుజం భుజంకలిపి వారితోపాటు కొందరు మేధావులు ముందుకు నడవలేకపోయ్యారు. నేడు సోవియట్ ప్రభుత్వాన్ని ఎదుర్కోడం తమశక్తికి మించినపని అయ్యేటప్పటికి ఏమీచేయలేక లోలోపల కుమిలిపోతున్నారు. విదేశాల్లో తలదాచుకుంటూ పతనమై చివికి చివికిపోతున్నారు. వాళ్ళకు మరణం ఆసన్న

మైంది. మరణానంతరంకూడా వాళ్లకు ప్రజాద్రోహులనే కళంకం శాశ్వతంగా నిలిచిపో తుంది. బూర్జువావర్గం అసలు సంస్కృతినే ద్వేషిస్తూఉంది. అవును ఆవర్గం నేడు అంతకన్నా చేయగలిగిందికూడా మరేమీలేదు. బూర్జువా దేశాల్లో జరుగుతూన్న వాస్త విక సంఘటనలే దీన్ని రుజువుచేస్తున్నాయి.

ఆయుధ విసర్జనకోసం సోవియట్ యూనియన్ చేసిన ప్రతిపాదనను బూర్జువా ప్రభుత్వాలు పూర్తిగా నిరాకరించాయి. పెట్టుబడిదారులు సంఘద్రోహు లనీ మరోప్రపంచ మారణహోమానికి వాళ్ళు సన్నాహం చేస్తున్నారనీ తెలుసు కోడానికి ఈ ఒక్క విషయమే చాలు.

బూర్జువా ప్రభుత్వాలవలంబించే యుద్ధవైఖరి ఫలితంగా సోవియట్ యూనియన్ కూడా ఆత్మరక్షణ సన్నాహం చేయవలసి వస్తూవుంది. మానవజాతి విజ్ఞానాభివృద్ధికీ, యావత్ ప్రపంచ ప్రాముఖ్యతగల దేశంగా సోవియట్ యూనియన్ను నిర్మించడానికీ వినియోగించవలసిన ఎంతో వస్తుసంపదనూ, శ్రమశక్తినీ, అమూల్యకాలాన్నీ సోవియట్ కార్మికవర్గం ఆయుధ నిర్మాణం కోసం వెచ్చించవలసి వస్తూవుంది.

పతనోన్ముఖమైన బూర్జువావర్గం ద్వేషంతోనూ వ్యాకులత్వంతోనూ ఉన్మత్తమై తనకు భవిష్యత్తులో పట్టబోయేగతికి భీతావహం చెంది ఒక ప్రవాహంలాగా మూర్ఖులను ఉత్పత్తిచేస్తూఉంది. బూర్జువావర్గం తమనేవిధంగా గోతిలో దింపబోతూవుందో ఈ మూర్ఖులు గ్రహించలేకపోతున్నారు. యూరప్‌లోని ప్రభువులకూ, బూర్జువా నాయకు లకూ, ఒకానొకమూర్ఖుడు ఇలా విజ్ఞప్తి చేస్తున్నాడు:

"మూడవ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీని నాశనం చేయడానికి ప్రస్తుత సమ యంలో పచ్చజాతులనుకూడా యూరప్ రాజ్యాలు ఉపయోగించుకోవాలి"

యూరప్‌లోని ప్రభువుల, బూర్జువా నాయకుల భావాలనే ఈమూర్ఖుడు కూడా ప్రతిబింబించి ఉంటాడు. ఈమూర్ఖుని భావాలనే అమల్లో పెట్టడానికి కొందరు 'పెద్దలు' తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. బాధ్యతలేని ఇలాంటి 'పెద్దలే' యూరోపునూ అమెరికాను పరిపాలిస్తున్నారు. యూరోపియన్లకు వ్యతిరేకంగా, 'తెల్లజాతు' లన్నింటికి వ్యతిరేకంగా తీవ్ర జాతిద్వేషాన్ని రగుల్కొల్పడానికి ఇండియాలో, చైనాలో, ఇండోచైనాలో జరుగు తూన్న సంఘటనలేచాలు, ఇది మూఢోద్వేషం. జాతిద్వేషం. ఓ జీవకారుణ్య హృద

యులారా! ఈ ద్వేషాలు మీతోటే సమసిపోతాయా? లేక మీ బిడ్డలకుకూడా సంక్రమింపచేయ దలచుకున్నారా? 'పరిశుద్ధ జాతీయరక్తం' అనే సిద్ధాంతాన్ని ప్రబోధించడంద్వారా జర్మనీ జాతిద్వేషాన్ని రెచ్చగొట్టడంద్వారా కళావేత్తలారా! మీకు లాభించేదేమిటి? ఇందుకొక ఉదాహరణ చూడండి.

"గటే (జర్మనీ మహాకవి) శత సంవత్సర వర్ధంత్యుత్సవ సందర్భంలో థామస్ మన్, వాల్టర్‌వాన్‌మోలో, ప్రొఫెసర్ హెన్రీలు పాల్గొనగూడదని తురింజియాలో హిట్లర్ పార్టీనాయకుడైన సాకెల్ జాతీయ సోషలిస్టు (నాజీ) గూఢ్రిపు వీమర్‌కు ఆదేశించాడు. పైన పేర్కొనబడినవారు ఆర్యజాతికి చెందినవారు కాకపోవడంవల్ల ఈ ఉత్సవంలో పాల్గొనరాదు."

జాతిద్వేషం ఎలాంటి ఫలితాన్ని ఇచ్చిందో చూడండి!

కళావేత్తలారా! మీరేపక్షమో నిర్ణయించుకోవలసిన సమయమిదే. నూతన జీవిత స్వరూపాలను దిద్దితీర్చే సంస్కృతికోసం పాటుబడేపక్షంలో ఉంటారా? లేక ఈ పక్షానికి వ్యతిరేకంగా కుతుకబంటి బురదలో కూరుకొనిపోయి జడమై మరణావస్థలోనున్న జాధ్యతారహితమైన పెట్టుబడిదారీ విధానాన్ని - దోపిడిదారీవిధానాన్ని - నిలబెట్ట బూనుకుంటారా?

---

"ఓరిమి! ఓరిమి గాడిదల సుగుణం. ఇతరులుపెట్టే బాధలకిలొంగి, సహించి, ఓరిమితో పడివుండడం మానవుణ్ణి నాశనంచేసేస్తుంది. ఓరిమి నిప్పులాగే ఆశ్రియమిచ్చిన వాళ్లని దహించేస్తుంది. ఓరిమి కలిగివుండండని బోధించేవాళ్లు ప్రజల్ని కనుగప్పి గాడిదలుగా చేద్దామని చూస్తున్నారన్న మాట."

— గోర్కీ

# జీవితం - రచన

టింగ్‌లింగ్

[జీవితం - రచన వ్యాసం రాసిన టింగ్-లింగ్ ప్రఖ్యాత నవలాకారిణి. ఆమెరాసిన 'దసన్–ఓవర్‌దిహూంకాంగ్ రివర్' అనే నవలకు స్టాలిన్ బహుమతి లభించింది. ఈమె తమ రచనా సామగ్రిని ఎప్పుడూ జీవితంనుంచే గ్రహిస్తారు. విముక్తియుద్ధంలో ఆమె సైన్యంతో కలిసి పనిచేసేరు. రైతుల్లో భూసంస్కరణల్లో పాల్గొన్నారు. తమ స్వీయ అనుభవాల ఆధారంగా ఆమె ఈ వ్యాసంలో యువ రచయితలకు కొన్ని సలహాలిచ్చేరు.]

మంచి రచనలు చేయడానికి గొప్ప జీవితానుభవం కావాలి. అయితే ప్రజలమధ్య (కష్టజీవుల మధ్య) జీవించడం, రచనకోసం జీవితానుభవం గడించడం— రెండూ వేరన్నట్టు కొందరు మాటాడుతున్నారు. ఈ భావం చాలామంది యువ రచయితల్ని కూడా పీడిస్తూంది. ప్రజా జీవితం గురించి తమకు చాలా తెలుసుననీ, దాన్ని సరిగా వ్యాఖ్యానించి సాహిత్యరూపం యివ్వడమే తమకు బాగా పట్టుబడడంలేదనీ కొందరు అంటున్నారు. జీవితానుభవాన్ని సవ్యంగా వ్యాఖ్యానించి విడమర్చి అవగాహన చేసుకోవాలి నిజమే. కాని, మనకి కావల్సినంత అనుభవం ఉందనీ, ఇకదాన్ని వ్యాఖ్యానించడానికి మార్క్సిజం - లెనినిజం, పార్టీ విధానాలూ అధ్యయనం చేయడం ఒక్కటే కొరవడిందనీ నేను అనుకోను. ఇలాటి తప్పుడు భావనవల్లే, 'జీవితంలో లోతుకుపోవాలి' అనే ప్రాథమిక సూత్రంకూడా కొందరు విస్మరిస్తున్నారు.

టాల్‌స్టాయ్, చెఖోవ్, సావో-షు-చిన్ మొదలైన రచయితలు గొప్ప గొప్ప రచనలు చేసేరంటే, వాళ్లు తమకి అతి సన్నిహితంగా తెలిసిన వ్యక్తుల్నే పాత్రలుగా చిత్రించడంవల్ల నంటున్నారు కొందరు కామ్రేడ్స్. బాల్యంనుంచీ బాగా ఎరిగున్నవాళ్ల గురించి కాబట్టి వారు సునాయాసంగానూ ప్రతిభావంతంగానూ రాయగలిగే రంటున్నారు. ఇవాళ రచయిత ఎవర్నిచూసి రాయాలి? శ్రామికులు, రైతులు, ప్రజాసైనికులు— వీళ్ళగురించి రాయాలంటే ప్రత్యక్షంగా వాళ్ళమధ్యనే జీవించాలి. వాళ్ళ బతుకులు దగ్గరగా పరిశీలించి వాళ్ళ పలుకుబళ్లు పట్టుకోవాలి. రాయాలంటే పాత్రలగురించి వెతుకులాడక తప్పదుకదా! ప్రజల్లో జీవించే కొద్దికాలంలోనూ వాళ్ళ ముఖాలూ పేర్లూ

పరిచయం అవుతాయే తప్ప వాళ్ళబతుకు గురించి క్షుణ్ణంగా తెలియదు. తమచుట్టూ ఉండేవాళ్లేమో పెట్టీ బూర్జువా మధ్యతరగతి మేధావులు. బంధువులతో సంబంధాలు అరుదు. స్నేహితులు అసలే ఉండరు. ఇక మీదితరంలో బాగాతెల్సిన వాళ్ళ గురించి రాద్దామంటే వాళ్లు నేటి యువకులకంతా విరుద్ధం— యీ యుగచరిత్రలో యిమడరు. మరియిక ఎవర్ని నమూనాలుగా నేటి రచయిత తనపాత్రలు చిత్రించుకోవాలి? కొందరు కాంప్రేడ్స్‌కి యివి సమస్యలు.

ఇదంతా నిజంవే. కాని దీని అర్థం ఏంవిటి? మన రచయితలు చాలా సంకుచితమైన పరిధిలో పన్చేస్తున్నారన్నమాట. చుట్టూ ప్రపంచంలో ఎన్నెన్నో అద్భుతమైన మార్పులు వస్తూవుంటే, మన రచయితలు కళ్లమూసుకుని ఓమూల నీరవంగా పడివున్నారన్నమాట. కుర్చీలో కూలబడి ఉత్తుత్తికబుర్లతో బతుకులో డొల్లనంతా భర్తీ చేయ జూస్తున్నారన్నమాట. వీళ్ళు చెబుతున్నట్టు కొందరు మహాకవులు గొప్ప గొప్ప రచనలు చేసినప్పుడు వారి మనస్సులో సజీవమైన నమూనాలు లీలగావుంటే వుండొచ్చు; నేను కాదన్ను. కాని ప్రజల నిజమైన బతుకుగురించీ వాళ్ల పోరాటాలగురించీ సమగ్రమైన అవగాహనలేని రచయిత— సంకుచితమైన పరిధిలో, ఒకేగాడిలో బతుకీడ్చే రచయిత— ఎంత సేపటికీ పోరాట రూపాన్నిగురించీ, వైరుధ్యాల సారాంశాన్నిగురించీ ఏ కరువుపెడతాడే తప్ప; నిజమైన ప్రజాజీవిత ప్రతిబింబాల్నిగానీ, నమూనాల్లా నిలబడే బలమైన పాత్రల్నిగానీ సృష్టించలేడు.

ఉదాహరణకు సు-కువాంగ్-యూవోను తీసుకుందాం. 'ది ప్లెయిన్స్ ఆర్ ఎబ్లేజ్' అనే నవల ఆయన చాలా గొప్పగా రాసేరు. కాని నిజానికి అది రాసేనాటికి ఆయన అంత చేయితిరిగిన రచయితేం కాదు. పదేళ్లపాటు సెంట్రల్ హూపేలో గడించిన గొరిల్లా జీవితానుభవాలూ, అక్కడి సహచరులు వాతావరణం మనసుపై వేసిన చెరగని ముద్రలూ ప్రేరేపించగా ఆ నవల రాసేరు. పాత్రలూ, సంఘటనలూ అన్నీ సిద్ధం. విస్తరించి విసుగు పుట్టించకుండా అనుభవాలన్నీ గుదిగుచ్చి రాసుకుపోవడమే తన పనయింది, రచయిత ప్రతిభనీ. సాహిత్యవిలువల్నీ తక్కువగా అంచనావేయ నవసరం లేదుకాని, ఆ నవల కేవలం రచయిత అనుభవాల రిపోర్టు అనవచ్చు. ఆ తరువాత కువాంగ్ సాహితీశిల్పంలో పరిణతిపొంది, మార్క్సిజం- లెనినిజం అధ్యయనం చేసి, ఒక సంవత్సరం పాటు కొరియాలో పర్యటించి అక్కడి కథలు కొన్నిరాసేరు కాని వాటిలో ఏ ఒక్కటీ పై నవలతో పోల్చడానికైనా పనికిరాదు, ఎంచేత? జపానుదాడికి ఎదురుగా సాగిన ప్రతిఘటన పోరాటంలో చైనా జీవితం తనకు అవగాహన అయినట్టు

కొరియా జీవితం (ప్రత్యక్షంగా చూసినప్పటికీ) ఆయనకు అంతుపట్టలేదు. ఆ జీవితం అనుభవజ్ఞానంగా ఆయన మనసుకెక్కలేదు— అందుకే రాయడానికి తొందరపడ్డంకంటె జీవితాన్ని ఎక్కువ అర్థం చేసుకోమని నేనన్నాను జీవితసారాన్ని గ్రహించడానికి అధ్యయనం యితోధికంగా తోడ్పడుతుంది. కాని, బయటికిపోయి జీవితానుభవం పొందకుండా, కేవల అధ్యయనంవల్లనే మంచి రచనలురావు.

జీవితానుభవం గడించడానికి కర్మాగారాలకూ, సైనికదళాలకూ వెళ్లేవాళ్ల గురించి వింటూవుంటాం, అలావెళ్ళి అనుభవంతో తిరిగి వచ్చినవాళ్ళను అప్పుడప్పుడు కలుస్తూ వుంటాం. వారి అనుభవాన్ని గురించి అడిగితే చాలామంది తడుముకుంటారు. వాళ్ళు చూసిన ప్రతి చిన్నవిషయం విపులంగా వర్ణిస్తారు కొందరు. అతి ఆయోమయంగా శ్రామికజన ఘనతను స్తుతిస్తారు మరికొందరు. ఈవివరాలన్నీ మనకి వార్తాపత్రికల్లోనే కనిపిస్తాయి కదా! ఈ రచయిత లందరూ జీవితంలోకి దిగకుండానే 'జీవితానుభవం గడించడం' అనే భావన పట్టుకువేళ్ళాడే రకం. గట్టున నిలబడో, పైపైనతచ్చాడు తూనో, ఉపన్యాసాలూ ప్రసంగాలూ వింటూ, నివేదికలు చదువుతూ, చర్చలుచేస్తూ సంగ్రహంగా నోట్సురాసుకుని; మహా అయితే స్వయం పరిశీలనవల్ల కొంత సమా చారం సేకరించి, అదే సాహిత్యసృష్టికి అత్యుత్తమమైన ముడిసరుకు అని మురిసి పోతారు.

ఇలా జీవితానుభవం సంపాదించడంవల్ల ఏమీ ప్రయోజనంలేదు. అంతకన్న యింట్లోనే వుండి సుఖంగా కాలక్షేపం చెయ్యడం మేలు. జీవితానుభవం కావాలంటే ప్రజల మధ్యకి పోవాలి. పాత భావాలతోను, సనాతనులతోను, అభివృద్ధి విరోధక శక్తులతోను ప్రజలు జరిపే పోరాటాల్లో స్వయంగా పాల్గొని వాళ్లతో ముందుకుసాగాలి. అంతేకాని, పైపైని పరిశీలిస్తూ, స్వంత గొప్పలు చెప్పుకుంటూ, తన ప్రగతితత్వాన్ని చాటుకోడానికే ప్రజల వూసెత్తేవాడు రచయితే కాడు. ఆలోచన ఆచరణ పోరాటపరం చేసి, కష్టాలు ఎదుర్కోడానికీ భరించడానికీ సిద్ధమయి, తనతో తనేపోరాడుతూ, సుఖ దుఃఖాలన్నిటికీ స్పందించగలిగినప్పుడే రచయిత కాగలడు. మానవతలో అన్ని అను భూతుల్నీ అతడు ఆకళింపుచేసుకోవాలి. ఒకసారి అధ్యయనం చేసేమని ఆక్కడితో ఆగిపోతే లాభంలేదు. జీవితాన్ని నిత్యమూ క్షుణ్ణంగా పరిశీలిస్తూనేవుండాలి. మధ్యమధ్య పునశ్చరణ చేసుకుంటూ సమీక్షించుకుంటూ అనుభవాలు క్రోడీకరించుకోవాలి. అందు వల్ల భావాలు స్థిరపడి, అవగాహన మెరుగుపడి, మొత్తంమీద జీవితం గురించే ఒక కొత్తస్పృహ ఏర్పడుతుంది.

'జనంలోకి పోవాలి, అనుభవం సంపాదించాలి' అంటూవుంటాం. ఎందుకు? ఇప్పుడు ప్రజలనుంచి దూరంగా బతుకుతున్నాం కనక. అయినా వాళ్ళగురించి రాయాలని ఉబలాటపడుతున్నాం కనక. అందుకని మనకితోచిన ఏకర్మాగారానికో, ఓ పల్లెటూరికో వెళ్ళి కొన్నాళ్లు గడిపి, యిక అక్కడితో జీవితం అంతా మనకి సమగ్రంగా తెలిసిపోయింది అనుకుంటాం. అంటే ఏమిటన్నమాట? మనం ఇప్పుడున్న స్థితిలోనే స్థిరంగా వుండాలని కోరుకుంటూ, కేవలం రచనా సామగ్రిని సమకూర్చుకోడానికి మాత్రమే— అదీ తాత్కాలికంగా కొంచెం కాలం మాత్రం— ప్రజల మధ్యకు వెడతాం. రచయిత ఉన్నతుడనీ, జీవిత సంగ్రామానికి వెలిగా నీడపట్టున ప్రశాంతంగా ఉండాలనీ ఒకభావన మనకి తెలియకుండానే మనలో ఉండబట్టే యిలా యధాస్థితికి అంటిపెట్టుకోవాలని మనం తాపత్రయపడతాం. రచనా సామగ్రికోసం ప్రజల్లోకి వెళ్ళడం తప్ప ప్రజా జీవితంపట్ల నిజంగా మనకివున్న ఆపేక్ష ఏమిటి?

సావో-షు-చిన్, షి-ని-యా—, టాల్‌స్టాయ్, గోర్కీ వంటి గొప్ప రచయితలు యీమాదిరి చేసేరని నేననుకోను. వారు ఎంతో ఆసక్తితో జీవితంలో పాల్గొన్నారు. ఏళ్ళతరబడి గడించిన అనుభవాన్ని జమచేసుకుని, తాము చూచిన— తాము జీవించిన— సంఘటనల్నీ, పాత్రల్నీ ఎన్నటికీ మరపురానంత ప్రతిభావంతంగా చిత్రించేరు. బతుకులో ప్రత్యక్షంగా చూసిన నిజాల్ని శక్తివంతంగా ప్రచారం చెయ్యదల్చుకున్నారు కాబట్టే వాటికి సాహిత్యరూపం కల్పించేరు. కీర్తికోసంవూ, రాయాలన్న కండూతి కోసంవూ రాయలేదు. కథవుందికదా అని వివరాలు పోగెయ్యలేదు.

మనపద్ధతి యిందుకు వ్యతిరేకం. మహత్తరమైన రచనలు చెయ్యాలనుకుంటాం గాని, ప్రజలతో కల్సి బతకడానికి యిష్టపడం. మన రచనల్లో చిత్రించదల్చుకున్న మనుషుల గురించి మనకేమీ తెలియదని తెలిసికూడా వారిగురించి క్షుణ్ణంగా తెలుసుకోడానికి మాత్రం ప్రయత్నించం. నీరసంగా నిస్తేజంగా బతుకీడుస్తూ మనచుట్టూవున్న బూర్జువా మేధావుల్ని మన రచనల్లో చిత్రించడానికి యిష్టపడంకాని, మనచుట్టూవున్న యీ పరిస్థితుల్లోంచి బయటపడ్డానికి ప్రయత్నించం; మీదుమిక్కిలి వాటితో రాజీపడి సర్దుకుపోయి కబుర్లతో కాలక్షేపం చేస్తాం.

కొత్త పాత్రల్ని సృష్టించాలనీ, మంచి రచనలు చేయాలనీవుంటే ప్రజల మధ్య స్థిరపడి వాళ్ళతో స్నేహాన్ని పెంపొందించుకోవాలి. నిత్యజీవితంలో వాళ్ళకి తోడుగా వుండి, సుఖదుఃఖాలు పంచుకుంటూ వారి విశ్వాసం చూరగొనాలి. అప్పుడే వారు

మనతో మనస్సువిప్పి మాటాడుతారు— మనల్ని వాళ్ళలో ఒకర్లుగా గుర్తిస్తారు. ఉత్సాహంతో, ప్రేమతో, బాధ్యతతో, నీతిగా— అన్నిటినీ మించి స్వార్థరహితంగా— వాళ్లలో కల్సిపోవాలి. అరమరికలులేకుండా వాళ్ని ప్రేమిస్తున్నామనీ ఎలాంటి పరిస్థితుల్లోనైనా ధైర్యంగా వాళ్ళతోనేవుంటామనీ వారికి నమ్మకం కుదిరితేనే వారు తమ అనుభూతుల్ని మనతో స్వేచ్ఛగా పంచుకుంటారు. ఇవన్నీ సమకూడితే యిక రచనాసామగ్రి గురించి దిగులే అనవసరం. జీవితంలో ఎంతో వైవిధ్యం వుంది. మానవ మేధ ఎన్నోరకాలుగా వికసనం చెందుతూంది. రచనార్హమైనవి ఎన్నో మనముందు కొత్తగా సాక్షాత్కరిస్తాయి

కొందరు రచయితలు శ్రామికులతో ఒకటి రెండుసార్లు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినంత మాత్రంచేతా, కొందరితో ముఖపరిచయం వున్నందువల్లా వాళ్ళతో తమ స్నేహాన్ని గురించీ జీవితంపట్ల తమ అవగాహన గురించీ గొప్పగా చెప్పుకుంటూ ఉంటారు. పరిచయాలు ఉండడం అవసరమే. కాని అవి ప్రాథమికం మాత్రమే. వారిమధ్య నిజాయితీతో బతకడం ముఖ్యం. కొందరు 'నాకు చాలా అనుభవం వుంది' అనే ధోరణిలో ఉంటారు. సాధారణంగా గ్రామాలనుంచీ సైన్యంనుంచీ తిరిగొచ్చిన యువ కామ్రేడ్స్ యిలా అనుకుంటూవుంటారు. కొంతకాలం ప్రజలమధ్య సైనికుల మధ్య మెలగి వీరు కొన్నివిషయాలు తెలుసుకొని వుండవచ్చు. కాని వీరికి తెల్సిందల్లా— పల్లెపట్టులో ఓమూల, ఉద్యమంలో ఒకభాగం, కొంతమంది కేడర్ల జీవితం— యింతే. ఇలా విడివిడిగా సేకరించిన సమాచారం సరిగా క్రోడీకరించుకోలేక వాళ్ళ అనుభవజ్ఞానం చాలా ప్రాథమికంగా ఒకేమూసలో పోసినట్టువుంటుంది. రాజకీయ సైద్ధాంతిక విజ్ఞానం పరిమితం కావడంవల్ల వారు తమ అనుభవాల్ని సమగ్రంగా అవగాహన చేసుకోలేకపోతున్నారు. అందరిలాగే వీరూ జీవితంలో అతి సామాన్య వివరాలు మాత్రమే గమనిస్తారు. ఒకోసారి వెనుకబడినతనాన్నీ అభ్యుదయ నిరోధకత్వాన్నీకూడా మెచ్చుకుంటారు. నన్నడిగితే యీ సోదరులు సరైన అనుభవజ్ఞానం వుందని అనుకోకూడదు. నిత్యనూతనమైన జీవిత సమగ్రరూపం వీరికింకా అంతు చిక్కనట్టే. ఎన్నోరకాల మనుష్యుల్ని కలుస్తూకూడా, వీరు ఎవరితోనూ కలవక తమ ప్రత్యేకతను నిలుపుకుంటూ సంకుచిత పరిధిలోనే జీవితం గడుపుతున్నారు. మరి యీ పరిస్థితిలో తమకు తగినంత అనుభవం వుందనీ, రచనా శిల్పం పట్టుబడకపోవడం ఒకటే తమ యిబ్బంది అనీ అనుకుంటే ఆదివంచనే అవుతుంది.

అయితే విశ్లేషణా సామర్థ్యాన్ని పెంపొందించుకోడం ఎలాగ? సిద్ధాంతాన్ని ఆచరణలో పెడుతూ జీవితంలో దూకడం ఒకటేమార్గం. పార్టీవిధానాలు క్షుణ్ణంగా అధ్యయనం చేసి, అనుభవాలు జమచేసుకుని సరైన నిర్ణయాలు చేయడమే అనుభవజ్ఞాన

సముపార్జనకు సూటైనదారి. జీవిస్తూనే జీవితానుభవాన్ని తర్కించి అవగాహన చేసుకోవాలి. ప్రజల్లోకి వెళ్ళకుండా యిది సాధ్యంకాదు.

కాబట్టి నేటి రచయిత తన సంకుచిత పరిధినుండి బయటపడాలి. స్వకీయమైన చొరవతో ఆవలయం నుండి బయటకు రావాలి. తనబతుకు ఎలావుండాలో నిర్ణయించుకోడం, పరిస్థితుల్నీ పరిసరాల్నీ కావల్సినట్టు మార్చుకోడం తనచేతుల్లోనేవుంది. అంతా అతని సంకల్పమైన చొరవపైన ఆధారపడి వుంటుంది. చొరవంటే, ధృడంగా నిశ్చయించుకోవడం, అందుకు తగిన పథకాలు వేసుకుని సరిగా అమలుచేయడం. స్వీయ మానసిక నిర్వ్యాపారతతో కూడా గట్టిగానే పోరాడాలి. యుద్ధంలో విజయం సాధించడానికి ఎంతో చొరవ అవసరం. సాహిత్య సృష్టికూడా అంతకన్న తక్కువేం కాదు. రచయిత ఎప్పుడూ బద్ధకంగా నీరవంగా వుండకూడదు.

ఒకసారి బయటపడి ప్రజల్లో కలిసేక ప్రపంచం మనకి మరింత కొత్తగా కనిపిస్తుంది. తమాషా వ్యక్తులెందరో మన్ని ఆకర్షిస్తారు వాళ్ళతోవుండి వాళ్ళ పుట్టుపూర్వోత్తరాలు వారి అభివృద్ధిక్రమం తెల్సుకుని రాయాలన్న కోరిక కలుగుతుంది. జీవితం గురించి తెలుసుకో నారంభించేక జీవనగతితో మరింత స్వైరవిహారం చెయ్యాలనీ, జీవితాన్ని యింకా సమగ్రంగా గ్రహించాలనీ ఆరాటపడతాం అయితే, తుఫానులో చిక్కడి ఆశ్రయం కోసం ఆగుతూ అనువైనప్పుడు సాగుతూ గమ్యం లేకుండాసాగే నావలాగ రచయిత నిలకడలేకుండా ఒకచోటి నుంచి యింకో చోటికి మారుతూండడం మాత్రం మంచిదికాదు. అలాకాక, ప్రజా జీవితంలో ఒక అపూర్వరంగం కనిపెట్టి అక్కడ స్థిరపడి దాని అభివృద్ధికి కృషిచేయాలి. తాను చిత్రించ దల్చుకున్న జీవితాన్ని పుష్కలంగా ప్రదర్శించగల పరిసరాల్ని ఎన్నుకుని అక్కడే దీర్ఘకాలం నివసించాలి. జీవిత పరిధిపెరిగిన కొలదీ ప్రజలపట్ల రచయిత అవగాహన పెరుగుతుంది, పరిశీలన నిశితమౌతుంది. అనుభవం ఎక్కువవుతున్నకొద్దీ రచయిత జీవితం మరింత పరిపూర్ణమౌతుంది. రచయిత మరింత అభివృద్ధి జెందుతాడు.

జీవితయాత్రలో కూరుకుపోతే సృజనాత్మకమైన అంశ మరుగున పడిపోతుందనే భయంకూడా ఒకటుంది అమితమైన పని భారంవల్ల తనలో రచనాసక్తి నశించిందని ఈమధ్య ఒక రచయిత నాతో అన్నాడు. ఇది పొరపాటు. బతుకంటే కేవలం బండ చాకిరీయేకాదు. రాత్రీ పగలూ అనకుండా కాళ్ళూ చేతులూ విరగదొక్కుకుని పని చెయ్యమని ఎవరూ అనరు. జీవితం నిత్యనూతనమైంది, సృజనాత్మకమైంది. ఎంతో మంది, రచయితలు కాకపోయినా, తమ నిత్యజీవితంలో తరచు తమ అనుభవాలకు అనుభూతులకు స్పందించి కవిత్వం రాయాలనే ఉద్వేగం పొందడం మనం చూస్తాం.

అంటే ఏంటి? చురుకైన జీవనవిధానంవల్ల నిజానికి కవితాంశ పెరుగుతుందే తప్ప తరగదు. చైతన్యానికే మూలాధారమైన జీవితం. సృజనాత్మక రచనాప్రవృత్తికి మాత్రం ఎలా అవరోధం అవుతుంది? ఎన్నటికీ కాదు. ఇంకా ఒకప్పుడు రచన చేయడానికి తగినంత తీరిక చిక్కకపోవచ్చు తప్ప, జీవితంలో ఎక్కువగా పాల్గోడంవల్ల సృజనాంశ చచ్చిపోడం అంటూ వుండదు.

సాహిత్య ప్రయోజనాన్ని ప్రజలు గుర్తిస్తున్నారు. తమ విధానాల్ని పరిపూర్ణంగా అవగాహన చేసుకోడానికి పరిజానాయకులు రచయితలకు అవకాశాలు కల్పిస్తున్నారు. తమ బతుకులు బాగా అర్థమైతే తమగురించి మంచి పుస్తకాలు రాస్తారన్న నమ్మకంతో రచయితల్ని ప్రజలు తమలో ఎక్కువకాలం వుండనిస్తారు. తమతో కలుపుకుని దాపరికంలేకుండా అన్నీ చెబుతారు. వాళ్ళను గురించిన రచన అసమగ్రంగా వున్నా, పొరపాట్లు దొర్లినాకూడా మన్నిస్తారు; ఏకొద్దిగా నిజం రాసినా ఎంతో సంతోషిస్తారు. నేడు ఎప్పుడూ లేనంతగా యింత అనుకూల పరిస్థితివుంది.

ఇలాటి చారిత్రక యుగంలో ఉంటున్న మనం మహత్తరమైన ఆశయాలకు అంకితమై వాటి సాఫల్యానికి కృషిచేయాలి. ప్రతి రచయితా మంచి రచనలుచేయాలి. మంచిదంటే నిజాయితీతో శక్తివంచనలేకుండా సిద్ధాంతపరంగానూ కళాత్మకంగానూ కూడా పటిష్ఠంగా వుండాలి. మనం మనస్నేహితులూ మెచ్చుకుని ముచ్చటపడ్డమే కాకుండా, వేలాది సామాన్య పాఠకుల మనసుల్ని హత్తుకునేటట్టు ఉండాలి. ఈనాడు వ్యాప్తికి రావడమేకాక ముందుతరాలకు విస్తరించేవి గావాలి. నేటికి వెలుగునిచ్చేవి మాత్రమేగాక ముందుకు దారిచూపేవిగా కూడా వుండాలి. మన రచయితలంతా అలాటి గొప్ప రచనలు చేయాలి.

'డ్రీమ్ ఆఫ్ ది రెడ్ ఛాంబర్', 'వాటర్ మార్జిన్', 'లైవ్స్ ఆఫ్ ది స్కాలర్స్' వంటి గొప్ప రచనలనుంచి మనం ఎంతో నేర్చుకోవాలి. లూసన్ రచనల స్థాయిని సాధించడానికి కృషిచేయాలి. ఇప్పటివరకూ రాసినదంతా అభ్యాసం అనుకుని యిక ముందు యింకా గొప్పరచనలు చేయాలి ఫలితంమాట అటుంచి మహత్తర ఆశయంతో నిర్విరామ కృషిచేయాలి. పరిస్థితుల్నీ పరిసరాల్నీ ప్రయత్నపూర్వకంగా మార్చుకుని మన జీవితపరిధిని విస్తృతం చేసుకోవాలి. ఇప్పుడున్న హద్దులు పరిమితులు అధిగమిస్తే మన కొచ్చేనష్టం ఏంవీలేదు. మన అభివృద్ధికి దోహదంచేసేవి ఏవీసిద్ధాంతం, విధానం, శిల్పం, సృజనాత్మకరీతులు. గొప్ప సాహిత్యం— ఏవీ ఏకొద్దిమంది సొత్తూకావు. గగనకుసుమాలు అంతకన్నాకావు. పరిశ్రమించి పరిశోధించే త్రాణవుండాలేగాని అవి అందరూ స్వంతం చేసుకోవచ్చు. కాబట్టి మళ్ళీమళ్ళీ నేను మన రచయితల్ని, ముఖ్యంగా యువ రచయితల్ని, కోరేదేమంటే ప్రజల్లో స్థిరపడి వాళ్లతో మమేకంగా జీవించండి.

[స్వేచ్ఛానువాదం : ఐ. వి.]

భావవిప్లవం - 3

# చిగుళ్లా - పిందెలా

కె. వి. రమణారెడ్డి

ధనస్వాములను పరిమార్చడమే ధనస్వామ్యాన్ని పరిమార్చడం కానట్టే, ధనస్వామ్యయుగ సంస్కృతిని మొత్తంగానే తుడిచిపెట్టడం కూడా కాదు. అది సాధ్యంకాకపోవడమటుంచి వాంఛనీయం కూడా కాదు లేకుంటే, ధనదాస్యం నుంచి బయటబడిన ప్రజలు మళ్ళీ చరిత్ర ప్రారంభకాలానికి వెళ్ళిపోవాలి. విప్లవం అలా వెనక్కు మళ్లేదై వుండదు. పిల్ల మళ్ళీ గుడ్డుగా మారదు.

అంతవరకూ సాగివచ్చిన చరిత్రగతికి ప్రధాన లక్షణం విరుద్ధవర్గాల సంఘర్షణ కాగా, అప్పటినుంచీ సాగబోయే లక్షణం వర్గనిర్మూలన. తద్వారా వర్గపోరాటాలకే ఇక స్వస్తి. ఇది ఆశయప్రాయమే కావచ్చు, యథార్థం కాకపోవచ్చు, గాని సోషలిజం అంటేనే వర్గవైషమ్యాల పరిష్కారమని అర్థం అణగారిన ధనదాసులు పూర్వసమాజంలో అత్యధిక సంఖ్యాకులైవుండిన కారణాన, రాజ్యాధికారం విప్లవం ద్వారా తమకు చేజిక్కినప్పుడు యావత్సమాజానికే విముక్తి లభించినట్టు లెక్క.

The history of class struggles forms a series of evolutions in which, now a days, a stage has been reached where the exploited and oppressed class- the prolitariat- cannot attain its emancipation from the sway of the exploiting and ruling class- the bourgeoisie- without, at the same time, and once and for all, emancipating society at large from all exploitaion, oppression, class distinction and class struggles. (Engels: Preface to the Manifesto of the Communist Party.)

వర్గపీడనకు ధనస్వామ్యం ఎలా శిఖరాయమానమైందో, మానవ సంస్కృతికి గూడా అలాగే అది పరాకాష్ఠ అయింది యంత్ర నాగరికతను అది అపారంగా వృద్ధి పొందేలా చేసింది. శాస్త్రవిజ్ఞానానికి ఎప్పటికప్పుడు కొత్తతెన్నులు చూపుతూ వచ్చింది. ఉత్పత్తిని అనంతంగా పెంచింది. అయితే ఈ పెరుగుదల నంతటినీ స్వలాభంకోసమే వాడుకొంది. నిజమైన వుత్పత్తిదారుల నోళ్లకొట్టి కడుపులు మాడ్చింది. శ్రమద్వారా మనిషి సృష్టించిన వస్తువు తనకు దక్కకుండా పోవడం మాత్రమేగాక, తననుంచి

బయటబడి ధనస్వామి చేతుల్లోకివెళ్ళి తనకే విరోధి అయికూర్చుంది. తన దాస్యానికే కారణమైంది. తాను సృష్టించిన ధనం తన దాస్యానికి సాధనం అయింది. ఈ దాస్యం నుంచి బయటపడి సదరు సాధనాన్ని తన చెప్పుచేతుల్లోకి తెచ్చుకోవాలంటే, రాజ్యాధికారం తనదికావాలి. విప్లవం ద్వారానే అది సాధ్యమౌతుంది. రాజ్యాధికారం ఒకరిచేతి నుంచి మరొకళ్ల చేతికి రావడమే విప్లవం.

ఆస్తినే నిర్మూలించడం విప్లవం ఉద్దేశంకాదు. ప్రైవేటు ఆస్తిని సమాజపరం చెయ్యడంతోటి విప్లవం సఫలమైనట్టుకాదు. మనిషికి మళ్ళీ తన మానవత్వాన్ని కలిగించడమే విప్లవం పరమార్థమని మార్క్స్ చెప్పాడు. వెనకటికి తననుంచి వెలువడిన మతం లాంటి భావాలకూ ధనం లాంటి పదార్థాలకూ తాను దాస్యం చెయ్యవలసివచ్చింది. ఇప్పుడు ఆ దాస్యం నుంచి తాను బయటబడాలి. ఆలా బయటబడినప్పుడే మానవత్వం తనకు అబ్బినట్లు.

Communism s the positive transcedence of private property, or human self-estrangement, and therefore as the real appropriation of the human essence by and for man; communism therefore as the complete return of man to himself as a social (i c., human) being– a return become conscious, and accomplished within the entire wealth of previous development. (Economic and Philosophic Mannscripts of 1844, Marx).

మనిషీ, ప్రకృతీ దైవభావానికి అధీనమైవుండడంగాక, ఆ భావాన్ని రద్దుచేసి మళ్ళీ స్వయం నిర్ణయాధికారాన్ని సంపాదించుకొంటాయి. నిరీశ్వరవాదంలా దైవాన్ని నిరాకరించడం ద్వారా మనిషిని యథోచితస్థానంలో పెట్టడంగాక, మనిషికి మరొక ప్రమేయం ఏదీలేకుండా, తనంతట తనకు స్వతస్సిద్ధంగా ఉన్న ప్రాముఖ్యాన్ని కమ్యూనిజం స్థాపిస్తుంది. ఆలాగే ప్రైవేటు ఆస్తిని తోసివెయ్యడం ద్వారా యథార్థజీవితాన్ని మనిషికి ప్రసాదించడంగాక, నేరుగా మనిషికి ఆ జీవితాన్ని కల్పిస్తుంది. మనిషిని మనిషిగా చేస్తుంది. మానవజాతి పూర్వచరిత్రకు భరతవాక్యం పలికి చరిత్రకు నాందీవాచకం చెబుతుంది. అందుచేతనే కమ్యూనిజం- కమ్యూనిజం ఒక్కటే– నిజమైన మానవతావాదం కాగలుగుతుంది. మానవజాతి వసంతమే కమ్యూనిజం.

కమ్యూనిజానికి తోవతీసే శక్తులు ధనస్వామ్యంలోనే గర్భస్థశిశువులా ఉన్నాయి. శిశూదయమే విప్లవం. ప్రసవవేదనలులేకుండా శిశువు భూపతనం చెందడం ఎలా అసా

ధ్యమో, మంత్రసాని లేకుండా ప్రసవం కావడంకూడా అసాధ్యమే. రాజ్యాధికారంకోసం జరిగే అత్యున్నతమైన వర్గపోరాటమే మంత్రసాని పనిచేసి ధనస్వామ్యం గర్భంనుంచి సోషలిజాన్ని తీసి బయటవేస్తుంది. తల్లిమాత్రం చనిపోతుంది. దాని తాలూకు మొక్కట్లు మాత్రం మొదట్లో సోషలిజాన్ని అంటిపెట్టుకొని వుంటాయి. దాని తాలూకు ధావవాసనలు మరి కొంతకాలం ప్రాణం నిలబెట్టుకొంటాయి. దానిబంట్లు ఇంకా అక్కడ ఉంటారు. అయితే వీటి అన్నిటినుంచీ బయటపడక తప్పదు. ఈలోపల వీటినిమాత్రం తనకు పనికివచ్చేట్లుగా సోషలిజం వాడుకొంటుంది. జనం మనస్సులనుంచి ధనస్వామ్యం తెగుళ్ళనూ భూస్వామ్యం మిగుళ్ళనూ తుడిచిపెట్టడానికి ఉద్యమిస్తుంది. ఆ ఉద్యమమే సాంస్కృతిక విప్లవం.

సామాజిక జీవితానికి ఆధారపీఠంగా (base) ఉన్న ఆర్థిక సంబంధాలేమో మారి, పైకట్టడంగా (Superstructure) ఉన్న సంస్కృతిమారకపోతే, సోషలిజం శక్తివంతజకో లేకపోతుంది కాబట్టి, పనిగట్టుకు ఈ పైకట్టడాన్ని మార్చివేస్తుంది.

Inequality in consumption, the love of rank, status and power and a social hierarchy based on wealth, belong to the bourgeoisie superstructure of capitalism; the superstructure of proletarian socialism requires acquisitiveness to be replaced by a spirit of service. (The Cultural Revolution In China; Joan Robinson)

ఇది రష్యాలోకంటె చైనాలో బాగా జరిగింది. అయినా లెనిన్ హయాములో రష్యాలోకూడా జరక్కపోలేదు. ధనస్వామ్య సంస్కృతి ప్రాభవకాలంలోగూడా సోషలిస్టు సంస్కృతి, చిగుళ్ళు, పిందెలు వేస్తూ ఉంటుంది కాబట్టి వీటిని సరిగా గుర్తించి దోహదంచేసి పెంచడం అవసరమని లెనిన్ భావించాడు. ప్రతి జాతీయ సంస్కృతిలోంచి దాని ప్రజాస్వామిక, సోషలిస్టు అంశాలను (elements) మాత్రమే (లెనిన్ స్వయంగా ఈ మాటను ఒత్తిపలికాడు) గ్రహించడమేగాక, ధనస్వామ్య సంస్కృతికీ ధనస్వామ్య జాతీయవాదానికి సంపూర్ణ (absolute) వ్యతిరేకతతో మాత్రమే (పైవానిలాగే దీన్ని లెనిన్ ఒత్తిచెప్పాడు) గ్రహించవలసి ఉంటుంది. ఏ సంస్కృతినైనా నిశ్శేషంగా నాశనం చెయ్యడం అసాధ్యం అంటూ, సంస్కృతిలోని కొన్ని భౌతిక అవశేషాలు అభేద్యాలని (indestructab'e)లెనిన్ చెప్పాడు. భారీ ధనస్వామ్య సంస్కృతి అంశాలనుంచే సోషలిజాన్ని నిర్మించడమంటూ జరుగుతుంది. ఈ అంశాలలో బుద్ధిజీవులు ఒకరు. వాళ్ళను పూర్తిగా నమ్మేందుకు వీల్లేదు. ధనస్వామ్యానికి సాధనాలుగా వినియోగపడిన బుద్ధిజీవులను సోషలిజానికి అనుకూలంగా వినియోగపెట్టుకోక తప్పదు.

ధనస్వామ్యం నుంచి దాని విజ్ఞానశాస్త్రాన్నీ యంత్రపరిజ్ఞానాన్నీ (technology) కళనీ స్వీకరించకతప్పదు. ఇవి బుద్ధిజీవులపరమైఉన్నాయి కాబట్టి వీళ్ళను ఉపయోగపెట్టుకోక తప్పదు. శత్రువులను మిత్రులుగా మార్చుకోవాలి. శత్రువులనుంచి కూడా నేర్చుకోవాలి.

I say again that the task of combining the victorious proletariom revolution with bourgeois culture, with bourgeois science and technology, which up to now has been available to few people, is a difficult one [The Achivements And Difficulties of the Soviet Government, Lenin]

మార్క్సిజం అనేది గారడీవాడి మామిడిమొక్కలా శూన్యంనుంచి పుట్టుకురాలేదు. అంతదాకా సాగిన మానవ విజ్ఞానంనుంచే అది పుట్టింది. శ్రామికజన సంస్కృతికూడా, ధనస్వామ్య, భూస్వామ్య సమాజాలలో మానవజాతి సమకూర్చుకొన్న విజ్ఞాననిధుల నుంచే ఉత్పన్నమౌతుంది. అయితే వాటిని జీర్ణంచేసుకొని ఒంటబట్టించుకొంటూ పనికి వచ్చే ప్రతి విషయాన్నీ మళ్ళీ మలచుకొంటూపోతుంది. శ్రామికజన సంస్కృతి అనేది మిగత వాటినన్నిటినీ నిర్విచక్షగా నిరాకరించివేస్తే పుట్టేదికాదు. అది మడిగట్టుకు గిరి గీసుకు కూర్చోదు.

Not the invention of a new proletarian culture, but the development of the best models, traditions and results of the existing (లెనిన్ స్వయంగా ఊది రాశాడు), from the point of view (ఇది కూడా) of the Marxist world outlook and the conditions of life and struggle of the proletariat in the period of its dictatorship. (Rough Draft of a Resolution on proletarian Culture, Lenin)

విప్లవం అనేది విప్లవకారులు మాత్రమే సాధించేది అనే పొరబాటుని లెనిన్ ఖండించాడు. విప్లవకారులు శ్రామికవర్గ అగ్రగామిదళం మాత్రమే (Vanguard). రకరకాల రంగాల్లో కమ్యూనిస్టేతరులతోటి ఒద్దికలేకుండా కమ్యూనిస్టు నిర్మాణం కొన సాగదనికూడా బోధించాడు. సంస్కృతి విషయాలలో తొందరపాటుగానీ గతాన్ని మొత్తంగా తుడిచిపెడుదామనే పద్ధతిగాని హానికరమని యువరచయితలనూ కమ్యూనిస్టులనూ హెచ్చరించాడు. సోషలిస్టు నిర్మాణానికి అంకురార్పణగా యథార్థమైన ధన స్వామ్య సంస్కృతిలోటని సరిపెట్టుకోవాలని చెప్పాడు.

అయితే ప్రజల సాంస్కృతిక స్థాయిని పెంచేందుకు నిరంతరమైన కృషి జరిగితేగాని, సోషలిస్టు సమాజం ఆర్థికవిజయాన్ని సాధించలేదు. విప్లవం ఆర్థిక విప్లవం

కావాలంటే, భావ వాతావరణం మారాలి. ప్రజలకు శతాబ్దాలనుంచి సాంస్కృతికంగా జరిగిన అన్యాయాన్ని అంతం చెయ్యాలి. కళల్లో వాళ్ళకు అభిరుచికలిగించాలి. ఇది జరగాలంటే విద్యాస్థాయి పెరగాలి.

Art belongs to the people. Its roots should be deeply implanted in the very thick of the labouring masses It should be understood and loved by these masses. It must unite and elevate thin feelings, Thoughts and will. It must stir to activity and develop the out instincts withinthem. (My Recollecti ns of Lenin, clara Zetkin)

మెన్షివిక్కులు నిందించినట్లు "తలలు తరగడమే" బోల్షివిక్కుల పనికాలేదు. ఎన్నితలలు నేలరాల్లాయో అన్నిటి కన్నితలల్లో విజ్ఞానదీపాలు అంకురించాయని లెనిన్ సగర్వంగా చెప్పుకొన్నాడు. వెనకబాటుతనంలో పడివుండిన జనాన్ని సుసంపన్నజగా మార్చేందుకు చైనాలో మావో సాంస్కృతిక విప్లవానికి సారథ్యం వహించాడు. విద్యార్థులకూ విద్యావిహీనులకూ మధ్య ఉండిన గండిని పూడ్చేందుకు రాజకీయం మొదలు సంస్కృతిదాకా విస్తారిన జీవిత పుష్పదళాల నుంచి చీడ వైదొలగేందుకు, ప్రజలే యథార్థంగా కూడా రాజ్యాధికారు లయ్యేందుకు, ఈ విప్లవం ఉద్యమించింది. కమ్యూనిస్టుపార్టీని కూడా మూలమట్టంగా సంస్కరించవలసి వచ్చింది. ప్రజలనుంచి పార్టీగుణపాఠాలు నేర్చుకోవలసి వచ్చింది. భావాలు, సంస్కృతి, ఆచారాలు, అలవాట్లు— ఇవి సరికొత్తగా ప్రజలకందరికీ ఏర్పడాలంటే, వీటి పాతరూపాలు వైదొలగాలి. దెబ్బకుగాని దయ్యం దిగిరాదన్నట్టుగా, రెడ్‌గార్డుల పిడుగుదాడికిగాని ఈ భావభూతాలు ఉచ్చాటన కాలేదు.

Chairman Mao often says that there is no construction without destruction. Destruction means criticism and repudiation. it means revolution. It involves reasoning things out, which is construction. Put destruction first, and in the process you have construction Marxism-Leninism, Mao Tse-Tung's thought, was founded and has constantly developed in the course of the struggle to destroy bourgeois ideology. [Circular of the Central Committee of the Chinese Communist Party, 16 May 1966]

ప్రజల భావజాలాన్ని విప్లవీకరించేందుకు, సాంఘిక ఉత్పాదనశక్తిని మెరుగుపరిచేందుకు, ఇందుకే, చైనాలో సాంస్కృతిక మహావిప్లవం ఉద్దిష్టమైంది.

సోషలిజం సాధనకోసం నడుములుబిగించిన కమ్యూనిస్టుపార్టీ ఏదైనా ధనస్వామ్య ప్రాభవంలోకూడా చిగుళ్ళుగా పిందెలుగా కనిపించే ప్రజాసంస్కృతి అంశాలను ఎప్పటి కప్పుడు పెంపొందింప జేసుకొంటూ పోవాలి. ఇప్పటినుంచే ప్రజల భావజాలాన్ని సంస్కరించే ప్రయత్నం మొదలుకావాలి.

మనదేశంలో విశ్వాసయుగం (Age of Faith) ఇంకా పూర్తిగా అంతరించ లేదు. మనిషి గుండె చేవనల్లా జావకంటె పలచనజేసే భావాలలో మతవిశ్వాసం బలీయ మైనది. దానికి హేతుచింతనతో పనిలేదు. విజ్ఞానశాస్త్ర దృక్పథానికి అది చుక్కెదురు. ప్రజల నైతికపతన స్థితికి అది కారణమే గాక, ఫలితంకూడా. జనం జనంగానే పడి ఉండడానికి, జనాన్ని అట్టడుగున్నే నిలిపివుంచడానికి, ఆస్తిక్యం, కర్మసిద్ధాంతం, హెచ్చుతగ్గుల కులవ్యవస్థ, సాధనాలుగా పనికివస్తున్నాయి. దేవుణ్ణి ఎదుర్కొని పద భ్రష్టుణ్ణిచెయ్యందే, మానవుణ్ణి పైకెత్తి పదస్థుణ్ణిచెయ్యడం సాధ్యంకాదు.

ఇందుకోసం హేతువాదయుగానికి (Age of Reason) బలమిచ్చే ప్రతి అంశా నికీ ప్రణాళికతులతోడ్పాటు ఉండాలి. దేన్నైనాసరే, వివేచించి నిగ్గుదేల్చి మరీ ఆమో దించే బుద్ధిపాటవం జనానికి కలగాలి. సంప్రదాయాన్ని సంప్రదాయంగానే మూపున మూటగా వేసుకొనిపోతే, కంచరగాడిదకూ మనిషికీ తేడా ఏమిటి?

ఆలోచనారీతి మారాలీ అంటే, చిన్నతనం నుంచి బోధించే విద్య స్వభావమే మారాలి. పుస్తక పాండిత్యంతోటి సరిపెట్టుకోక, పాఠశాలకూ పొలానికీ– చదువుకీ జీవితానికీ– విద్యాధికులకూ జనానికీ- మధ్య సాన్నిహిత్యాన్ని కలిగించాలి. మనిషిని కించపరిచే మతాన్నీ, సామూహిక క్రియాశక్తిని చిన్నచూపుచూసే వ్యక్తిప్రాముఖ్యాన్నీ హేతుబుద్ధిని కిందుచేసే విశ్వాసప్రాబల్యాన్ని విద్యార్థుల మనస్సుల్లో ప్రవేశించకుండా చెయ్యాలి. మనిషికి అసాధ్యమైంది ఏదీ ఉండదనే ఆత్మవిశ్వాసం కలిగేలా, నిరంతర ప్రయోగాలతోనే పురోగతి సాధ్యమౌతుందనే భావం ఏర్పడేలా, నిన్నటికంటె రేపం టేనే ఆకర్షణకలిగేలా, చదువుమారాలి. ముందుకుపోవడానికే చదువుగాని, ఉన్నచోట ఉండిపోవడానికి కాదు, వెనకనే పడిపోవడానికి అసలేకాదు. ముందుతరం విజ్ఞాన సంపదతో తృప్తిపడే కొత్తతరం ఏదీ చరితార్థంకాదు. పెద్దల తలదన్నినప్పుడే పిన్న వాళ్లు ప్రయోజకులౌతారు. గతానుగతికత్వం కంటె ఏ జాతికిగానీ పెనుశాపం మరొకటిలేదు.

మందిమందగానే ఉండిపోగూడదు. గొర్రెదాటు సరేసరి, మాంద్యం మనస్సుకు లోహశృంఖల లాంటిది. తమ జీవితగతిని ఎలాగంటే అలా మార్చివెయ్యగల రాజకీయాలపట్ల నిర్లిప్తతకూడనే కూడదు. తాము ఎల్లకాలం అనుచరులుగా, నాయకుల మందీమార్బలంగా ఉండిపోవడం, అప్రయోజకత్వానికి నిర్వచనమే. రాజకీయం తమ నిత్యకృత్యం కావాలి. జనంకోసం మరెవరో పాటుబడడంకంటె జనమే పాటుబడితే ఇప్పటి ఈ రంకుబొంకుల, రంగులరాట్నాల, అరిచేతివైకుంఠాల, ఎన్నికజాతర్ల, దగా రాజకీయం ఇలాగుండదు. ప్రజల విముక్తి ప్రజాధీనమే.

దీనికి వర్గపోరాటామే పంథా. అది ఎప్పుడూ ఒకేతీరుగా ఉండదు. బియ్యానికి చెప్పిన మంత్రమే పిడుక్కి చెప్పగూడదు. మామ్మూలుగా వర్గపోరాటాలు ఆర్థికమైన కోర్కెలకే పరిమితమై ఉంటాయి. అందులో తప్పులేదు ఎల్లకాలమూ అవి ఆ ఉక్కుపంజరంలోనే చిలకల్లా ఉండిపోవాలనడం తప్పుమాత్రమే గాక, ప్రజలపట్ల నేరం, చరిత్రకు అపరాధం. వాటికి రాజకీయ స్వభావం అలవడాలి. రాజకీయాధికారాన్ని కైవసం చేసుకొనేందుకే వర్గపోరాటం మొదటినుంచీ అంకితమై ఉండాలి.

ఆ పోరాటంలో ఆయుధధారణ తప్పనిసరి అవుతుంది. శమీవృక్షంమీద దాచిన ఆయుధాలను దించి చేదాల్చినప్పుడే బృహన్నల ధనుంజయుడుగానూ కిరీటిగానూ విజృంభించాడు. శాంతియుత పరివర్తనద్వారా చేజిక్కించుకొనే రాజ్యాధికారం ఎన్నో పరిమితులకూ సర్దుబాట్లకూ లోబడవలసి ఉంటుంది కాబట్టి శ్రామికవర్గంలోకి దూరివచ్చిన ధనస్వామ్యం తాబేదార్లుమాత్రమే శాంతియుత పరివర్తనమార్గాన్ని శ్రామికవర్గం ముందు చూపుతారు. జనాన్ని కదిలించి మాంద్యం వదిలించి పోరాటంలోకి దించి నడిపే కమ్యూనిస్టే ఆ పేరుకి యోగ్యుడు. తతిమావాడు వంచకుడు ఈ పోరాటంలో బలప్రయోగం తప్పదు.

We, of course, are not opposed to violence. We laugh at those who are opposed to the dictatorship of the proletariat, we lough and say that they are fools who do not understand that there must be either the dictatorship of the proletariat or the dictatorship of the bourgeoisie. Those who think otherwise are idiots, or are so politically ignorant that it would be a disgrace to allow them to come anywhere near a meeting, let alone on the platform ...whoever dreams of a middle course is our most harmful and dangerous enemy. [Achievements And Difficulties of the Soviet Government, Lenin]

కొందరు "విమర్శకులు" దౌర్జన్యం గురించీ హింస గురించీ గొంతులు చించుకొని బొమ్మలు బాదుకొంటున్నారు. హింస అనేదిగానీ, బలప్రయోగం అనేదిగానీ, చారిత్రక అవసరం అనేమాట అటుంచి చారిత్రక యథార్థమని ఆలోచనాపరుడు ఎవడైనా అంటాడు. రాజ్యాంగమే సంస్థాకృతి ధరించిన పెనుహింస, రాజ్యాంగ స్వభావమే బలప్రయోగం. అది ఎవరు ఎవళ్లమీద అమలుపెడతారన్నదే అసలు విషయం. అధిక సంఖ్యాకులమీద అల్పసంఖ్యాకులా లేక అల్పసంఖ్యాకులమీద అధిక సంఖ్యాకులా? పీడనకు గురయ్యేవారిమీద పీడించేవాళ్ళా లేక పీడించేవాళ్ళమీద పీడనకు గురైనవాళ్ళా? పోరాటమార్గం పట్టిన ప్రజాశక్తులను 'హింస' పేరుతో నిందించడమంటే, ప్రభుత్వ వ్యవస్థను సమర్థించడమే. ఇలాంటి వాళ్ళను పిలవడానికి కింకరులనే మాటగూడా చాలదు. వాళ్ళకంటె పేడ పురుగులుకూడా నయం.

జనం ప్రజగా మార్పుచెందడానికి, సాంస్కృతికంగా ఏదేదైతే అవసరమో అదంతా విప్లవ రచయితల సంఘానికి శిరోధార్యం. అది జనంనోట్లో నాలుగ్గా జనం చేతి భావాయుధంగా ఉండదలచింది. నేరుగా దానికి రాజకీయాలలో ప్రవేశంలేదు. ఇది కపటనాటకమనుకొనే వాళ్ళను సంతోషపెట్టడానికి గూడా, రాజకీయపార్టీల తోకగా మారిపోయేందుకు మాసంస్థ సిద్ధంగాలేదు. రాజకీయాలకు అతీతం కానట్టే అధీనంకూడా కాగూడదని మేము ఆలోచించి నిర్ణయించుకొన్నప్పుడు, మధ్యలో ఈకాకిగోల ఏమిటో? మాకు కావలసిందల్లా భావ దాస్యబంధాల నుంచి మన జనం బయటపడడమే. కాగల మిగతపని గంధర్వులు చేసుకుపోతారు. రాజకీయం ప్రజలది; కాకుంటే రాజకీయ పార్టీలది, వి ర సం సాహిత్య, సాంస్కృతిక సంస్థ. దీనికిగూడా రాజకీయ లక్ష్యాలున్నాయి, రాజకీయ ప్రమేయంకూడా ఉంది. వాటన్నిటికీ పరమావధీ, మార్క్సియన్ సోషలిజం సాధన.

---

"మీరు (రచయితలు) పద్ధతిని, విధానాన్ని, కౌశలాన్ని బాగా అలవరుచుకోవాలి. ఆ కౌశలం లేనిదే చివరికి చెప్పులుకూడా కుట్టలేమే. మన పూర్వకవుల గ్రంథాల్ని క్షుణ్ణంగా చదవాలి. వాళ్ళంటే భయపడకండి. వాళ్ళు మీ భావాలనేమీ మార్చరు. పైపెచ్చువాళ్ళు మీ కౌశలాన్ని పెంపొందిస్తారు. మాటలతో కోటలు కట్టేవాళ్ళని చూసి కంగారు పడక్కరలేదు. సహజత్వం, సత్యం,- ఈ రెండూ అమడలవంటివి వాటికి మూడో సోదరి 'సౌందర్యం'. రచనలమీదే మీకాలాన్నంతనూ వినియోగించుతూండండి."

—గోర్కీ

# భావ పరివర్తన - విరసం

కొడవటిగంటి కుటుంబరావు

"Before a brand-new social system can be built on the site of the old, the site must be first swept clean. Old ideas reflecting the old system unavoidably remain in people's heads for a long time. They do not easily give way" —Mao.

[పాత వ్యవస్థమీద సరికొత్త సాంఘికవిధానం నిర్మించాలంటే, మొదట పాత వ్యవస్థను శుభ్రంగా ఊడ్చెయ్యాలి. పాత వ్యవస్థను ప్రతిబింబించే పాత ఆలోచనలు అనివార్యంగా ప్రజల మనసుల్లో చాలకాలం వుంటాయి. అవి అంత సులభంగా కొత్త వాటికి దారివ్వవు. —మావో.]

మానవ సమాజం ఎన్నిరూపాలలో ఉండగలదో, ఏరూపం నుంచి ఏరూపానికి పరిణతిపొందిందో ఆ పరిణామాల వెనక ఉండిన భౌతికకారణాలు ఏమిటో ఈనాడు విద్యావంతులకు చాలామందికి తెలుసు. విద్యాధికులు కానివారికికూడా అపరిణత సమాజాలను గుర్తించేశక్తి ఉంటుంది. ఇల్లూ వాకిలీలేకుండా సంచార జీవితం గడుపుతూ, ఏచెట్లకిందనో కుటుంబాలతోసహా కొద్దిరోజులు ఉండిపోతూ, ఎలుకలనూ, పిల్లులనూ పట్టితింటూ జీవించే లంబాడీల సామాజికవ్యవస్థ మనకన్న అపరిణతమైనదని గ్రహించటానికి పెద్దగా విజ్ఞానం అవసరంలేదు. అలాగే మనదేశంలో ఆదిమ జాతులవాళ్ళూ, ఆటవిక జాతులవాళ్ళూ ఉన్నారు. వారికీ ఒకసామాజిక వ్యవస్థా, కొన్ని నియమాలూ ఉన్నాయి. నిజం చెప్పాలంటే ఆ సామాజికవ్యవస్థలో ఉన్న కొన్ని మంచిలక్షణాలు మనవ్యవస్థలో లేవు— నిజం చెప్పటమూ, పరస్పర సహకారమూ, సమిష్టి జీవనమూ మొదలైనవి. అయినా అవి అపరిణత సమాజాలే. వాటికి కాలదోషం పట్టింది.

ఇలాటి అపరిణత సమాజాలలో ఉండే "స్వచ్ఛ సౌందర్యాలను" అర్థంచేసుకున్న నాగరిక మానవులు వాటిని అలాగే కొనసాగనివ్వమని అభ్యర్థిస్తారు. "ఆదిమజాతుల వాళ్ళకు ఇనపనాగలి ఇవ్వకండి. వాళ్ళు బాధపడతారు", అన్నాడు వెరియర్ ఎల్విన్.

కొయ్యనాగళ్ళు మాని ఇనపనాగళ్లు వాడమంటేనే బాధకలుగుతుందంటే, వేటాడి జీవించేవాళ్లు వ్యవసాయం చేపట్టి గ్రామాలు ఏర్పాటుచేసుకుని, స్థిరనివాసాలు కల్పించు

కుని, చాలా విస్తృతమైన సమాజాలలో నివసించటం ప్రారంభించాలంటే ఎంతబాధో మనం ఊహించవచ్చు. అవును, అది సామాజిక వ్యవస్థలో ఒక విప్లవ పరిణామం. విప్లవ పరిణామాలు "బాధ" లేకుండా సాధ్యంకావు. మారుమూల పల్లెటూరివాళ్లు ఏమహా నగరానికో వచ్చి, రెండురోజులు కూడా ఉండలేక, తిరిగి తమ గ్రామాలకు పారిపోయి హాయిగా ఊపిరి పీల్చుకోవటం మనకుతెలుసు. ఒకే సమాజంలో రెండుపొరల మధ్య అంత అంతరం ఉన్నది. ఆ పల్లెటూరివాడికి ఈ మహానగరం జీవితంలోని వేగమూ, "అనాచారమూ", "విశృంఖలత్వమూ" దుర్భరమనిపిస్తాయి.

మొత్తం సమాజంలో కాలక్రమాన విధిగా జరిగే విప్లవ పరిణామాలు, వాటికి సిద్ధంగా లేనివాడికి ఇంకెంత దుర్భరమనిపించవచ్చు!

మరొకవ్యక్తిని తీసుకుందాం. వాడూ గ్రామంనుంచి మహానగరానికి వచ్చినవాడే, అయితే వీడు గ్రామీణ జీవితంపైన మానసికంగా ఎదిగినవాడు. అంతకన్న పరిణత జీవితం నగరంలో ఉన్నదని గ్రహించినవాడు. వాడికి మహానగరం, తనకుగ్రామంతో పోలిస్తే, స్వర్గంలా గుంటుంది. మొదటివాడికి వేగం అనిపించినది వీడికి చైతన్యం, విశృంఖలత్వంగా కనిపించినది స్వేచ్ఛ, అనాచారంగా కనిపించినది మూఢాచారాలనుంచి విముక్తి. వీడు కుగ్రామానికి తిరిగిపోలేడు. పోతే ఏమాత్రమూ సుఖపడడు, ఖైదులోకో అరణ్యంలోకో పోయినట్టు బాధపడతాడు. వీడు మెట్టుఎక్కాడు.

కాని అంతటితో వాడికి మోక్షం లభించిందా? లేదు. వీడు ఈ మహానగర జీవితంనుంచి స్వీకరించగలడుగాని దానికి ఏమీ ఇయ్యలేడు. తనకుగ్రామంలో ఉన్న పొలాలూ పుట్రలూ అమ్మేసి ఒకవెలుగు వెలిగి ఆరిపోతాడు.

విప్లవ పరిణామాలు సంఘంలో తోసుకు వచ్చినప్పుడు వాటికి మానసికంగా సిద్ధంగా ఉన్నంతమాత్రాన చాలదు. వాటికి అనుగుణంగా జీవితవిధానాన్ని మలచుకో వలసి ఉంటుంది.

## 2

మన జీవితం కీకారణ్యంకన్న అధ్వాన్నంగా ఉన్నది. ఈ జీవితంలో శ్రామికులూ, పాటకులూ, దరిద్రులూ మనుషుల్లాగా బతకటం అసంభవం. వాళ్ళు సమిష్టిగా తలుచుకుంటే జీవితాన్ని క్షణంలో స్తంభింపజేయగలరు. (నిన్న బ్రిటిషు బొగ్గుగని పని వాళ్లు ఏంచేశారో చూడండి) నాగరికత అలాంటి శక్తిని వారిచేతికి ఇచ్చిందిగాని, మన సామాజికవ్యవస్థ వారికి కడుపునిండా తిండికూడా ఇవ్వదు అందుచేత ఈ సామాజిక వ్యవస్థకు అంగరక్ష వారిలో భావచైతన్యం లోపించటమే.

వలసపాలన మనదేశంలో సాగినప్పుడు పాశ్చాత్యులు మనని కొంతవరకైనా సామాజికంగా అభివృద్ధికానిచ్చారు. వారిది సత్పరిపాలన అనలేం. ఒకవేళ అందామన్నా సత్పరిపాలనకన్న స్వపరిపాలన మేలు. మనకు స్వపరిపాలన రానేవచ్చింది. తమ పాలకులను ప్రజలే ఎన్నుకునే పరిస్థితిలో దేశంలోని అన్నివర్గాలూ కొంతవరకైనా బాగుపడి ఉండవచ్చు. కాని అది జరగలేదు

అందుకు రెండు కారణాలున్నట్టు నాకుతోస్తుంది. ఒకటి, బూర్జువా ప్రజాస్వామికానికి కాలదోషం పట్టటం. రెండు, మనదేశంలో బూర్జువా ప్రజాస్వామికం నుంచి లాభంపొందే మన సత్వం పాలితులకుగాని, పాలకులకుగాని లేకపోవటం.

ప్రపంచం మొత్తంమీదనే బూర్జువా ప్రజాస్వామికానికి నూకలుచెల్లాయనటానికి చాలా అధారాలున్నాయి. ఇంగ్లండు అమెరికాలలో ఏపక్షం పాలనాధికారం వహించినా ఒకేవిధమైన ప్రజాద్రోహం జరుగుతూ ఉండటం చూస్తున్నాం. పీకితులపట్లా, అంత ర్జాతీయ అవినీతిపట్లా "బైపార్టిజాన్" విధానాలు చక్కగా కొనసాగుతున్నాయి. కుమ్ములాటలు పార్టీలమధ్య జరిగినప్పుడు వాటికి ప్రజాభ్యుదయంతో ఎలాటి సంబంధమూ ఉండటంలేదు. ఇంతకన్న "శ్రామికవర్గ నిరంకుశత్వం" ప్రజలకు ఎన్నోరెట్లు మేలు చేస్తూ ఉండటంకూడా మనం చూస్తున్నాం. అవే ఈనాడు గట్టిదేశాలు. వాటికోసమే "ఫ్రీవర్ల్డ్" పురాణకాలపు రాక్షసత్వాన్నీ, పైశాచికత్వాన్నీ ఒకవంక అవలంబిస్తూ, మరొకవంక పతనావస్థలో పడిపోతోంది. ఈవిషయం రాజకీయవిజ్ఞులకు వదిలేస్తాను.

మనం బూర్జువా ప్రజాస్వామికానికి కూడా సిద్ధంగాలేమని రోజూ మనపత్రికలు చెబుతున్నాయి. వెనక ఒక కాంగ్రెసు మంత్రి ఒకచోట ఉపన్యాసంచేస్తూ, "మీరు మా ప్రతినిధిని గెలిపించలేదు. మేము మీ ప్రాంతానికి సదుపాయాలు ఎందుకు చేయాలి?" అన్న అర్థంవచ్చేట్టు మాట్లాడాడట. (తరవాత తాను అలా అనలేదన్నాడనుకోండి. కాని ఆమాట అచ్చేసిన పత్రికమీద దావాపడెయ్యలేదు మరి)

నిన్నటి (4 మార్చి) "ఆంధ్రజ్యోతి" పత్రికలో ఇలా ఉన్నది. "డబ్బు తీసుకున్నా ఓట్లు (అంటే వోట్లు) మాకు వెయ్యండి. శ్రీ ఇస్మాయిల్ విజ్ఞప్తి".

అభ్యర్థులు వోట్లకోసం డబ్బివ్వటం గురించి శ్రీ ఇస్మాయిల్‌కు అభ్యంతరం లేదు. ఆ ఆచారాన్ని ఆయన ఆమోదిస్తూ, వోటర్లకు కృతఘ్నత మప్పుతున్నారు శ్రీ ఇస్మాయిల్. వోటర్లను ఇచ్చినమాట నిలుపుకోవద్దంటున్నారు. శ్రీ ఇస్మాయిల్ ఈమాటను కాంగ్రెసు అధిష్ఠానవర్గం తరఫునే అంటున్నారనుకోవాలి. ఈయన రాష్ట్ర కాంగ్రెస్ అడ్‌హాక్ కమిటీ అధ్యక్షులు.

ఇంతకన్న కూడా విలువైనముక్క శ్రీ వి. బి. రాజు (తెలంగాణ నాయకులు, పార్లమెంటు సభ్యులు) సెలవిచ్చారు. "రాష్ట్రంలో కాంగ్రెసుకు మెజారిటీ రాకుంటే రాష్ట్రపతిపాలనే!"

కాంగ్రెసేతర పార్టీలు ప్రాంతీయంగా నెగ్గినట్టయితే వాటిని తోసిపారేసేటందుకు తగిన ఏర్పాటు మన రాజ్యాంగంలో ఉన్నదని ప్రజలకు శ్రీ వి. బి. రాజుగారు జ్ఞాపకం చేస్తున్నారు. ప్రజలు శుంఠలన్నభావంతో వారు అలా జ్ఞాపకంచేసి ఉంటారు. లేకపోతే ఇందులో కొత్తసత్యం ఏమీలేదు స్వతంత్ర భారత చరిత్రనిండా ఇది ఉన్నదే. ఈ దేశాన్ని కాంగ్రెసు తప్ప మరేపార్టీకూడా పరిపాలించలేదు. పరిపాలించజాలదు.

ఇది ప్రజాస్వామ్యం కాదు. కాదని ప్రజలకుతెలీదు. ప్రజాస్వామ్యమంటే ప్రజలకు తెలీనంతకాలమూ మనకు ప్రజాస్వామ్యం ఉండటానికి వీల్లేదు.

ఎన్నికలు ఉండటమే ప్రజాస్వామిక లక్షణమన్నది అపోహ. ఏయే నియోజక వర్గాలలో ఏయే కులాల వోటర్లసంఖ్య ఎంత ఉన్నదో బాహాటంగా ప్రదర్శించి, కులం వాళ్ల తమకులం వాడికే వోటువేస్తారన్న అభిప్రాయాన్ని రాజకీయంగా వినియోగించుకుంటున్నారు. అభ్యర్థుల ఎన్నికా వారికి పోటీదార్లను ఎన్నుకోవటమూ ఇదే ప్రాతిపదికపై జరుగుతున్నది.

ఇదికూడా ప్రజాస్వామ్యంకాదు. (కులాలవారీ వోట్లు గణజీవితానికి చెందినవి). అయితే ఈ కులప్రాతిపదిక దాఖలాలు చూపుతున్నది। ఫలితాలు ఇస్తున్నది.

ఎన్నికలద్వారా సోషలిజం వస్తుందా, రాదా అన్నది అనవసరమైన ప్రశ్న. వాటిద్వారా ఇప్పటి పరిస్థితిలో మనదేశానికి బూర్జువా ప్రజాస్వామ్యం కూడా రాదు. ఇంకెప్పుడో వస్తుందని నమ్మకోవటం అవివేకం.

వెనకపడిన దేశాలు ముందుకు రావాలంటే సోషలిజమే శరణ్యమని నెహూ్ర ఏనాడో అన్నాడు. ఆమాటకు కాలదోషం పట్టలేదు గనకనే మన పరిపాలకులు ఆ మంత్రాన్ని శివపంచాక్షరిలాగా జపిస్తున్నారు.

మనదేశంలో సోషలిస్టు ఆర్థికవ్యవస్థా, కమ్యూనిస్టు సమాజమూ ఏర్పడాలంటే సమాజంలో విప్లవకరమైన మార్పులురావాలి. రేపు రాబోయే మార్పులకు అనుగుణంగా ఇవాళ ప్రజల దృక్పథాలు మారాలి. లాంఛ్రీమూసేసి చెప్పుల షాపుపెట్టినంత సులువు కాదు. ప్రజల బుద్ధులూ, నమ్మకాలూ ఉన్నవ్యవస్థను వీలయినంతవరకు ఆధారం చేసుకుని కొనసాగుతాయి. కొన్ని సందర్భాలలో అవి నూరేళ్ళ, వెయ్యేళ్ళ క్రితం ఉండిన

సామాజిక వ్యవస్థలను ఆధారం చేసుకునికూడా నిలబడతాయి. రేపు రాబోయే వ్యవస్థకు అనుగుణంగా భావాలను తీర్చిదిద్దుకోవటమనేది మహా మేధావులకు తప్ప సాధ్యంకాదు. ఆ రావలసిన, రాదగిన, రానున్న వ్యవస్థను ఎంత సునిశితంగా చూడగలిగితే అంత ద్రష్ట. మార్క్స్, లెనిన్, మావోలు ఆ జాతికిచెందిన ద్రష్టలు అందుకే నిజమైన మేధావులు అలాటి ద్రష్టలను అనుసరిస్తారు.

ఈనాడు మనం మనచుట్టూచూసే మూఢాచారాలూ, దేవుడి ముడుపులూ, నిలువు దోపిడీలూ, రాజకీయవంచనలూ, ప్రగతి వాదులపైనా, ప్రతిపక్షులపైనా హత్యాకాండలూ, భయంకరమైన అజ్ఞానమూ, దారిద్ర్యమూ– ఇవిపోయి తీరుతాయి; దైవికంగా కాదు. ఇవి ప్రకృతికీ, మానవప్రకృతికీ విరుద్ధం గనక; నిజం జ్ఞానంద్వారా కాక పోతే అనుభవం నుంచి అయినా తెలుస్తుంది గనక। ఈవ్యవస్థ మారుతుంది. ఆమార్పు ఎలా ఉండాలోకూడా మనం ఊహించవలసిన పనిలేదు. మనకన్న తక్కువ పరిణతిగల సామాజిక వ్యవస్థలను మనం గుర్తించ గలుగుతున్నాంగాని మనను అధిగమించిపోయిన సమాజాలను మనం గుర్తించలేకుండా ఉన్నాం. కారణం వెనకచూపు; ముందుచూపు లేకపోవటం.

రానున్నపరిణామం విప్లవ పరిణామమని గుర్తించలేనివాళ్ల చాలామంది ఉన్నారు. కాంగ్రెసుకు దండిగా వోట్లు వెయ్యటం తప్ప ఇంకేమీ అవసరంలేదని పాలకవర్గం కేకలు పెడుతున్నది. ఇది కాంగ్రెసు మార్కు రాజకీయవిజ్ఞానం అనుకోవాలి కాబోలు.

నామటుకు నాకు మన సమాజం యొక్క పరిణత ఒక మహాయజ్ఞం రూపంలో తప్ప కనిపించటంలేదు. కుగ్రామం నుంచి మహానగరానికి వెళ్లేవారిలో రెండురకాలను గురించి మొదట చెప్పాను. ఆ రెండురకాల వాళ్ళూ రానున్న విప్లవానికి ఉపకరించని వాళ్ళే. మొదటిరకం వాళ్ల సోషలిస్టు వ్యవస్థనుచూసి హడిలిచస్తారు. రెండోరకం వాళ్ల అందులో మంచిచూసి కూడా దానికి అనుగుణంగా తమ జీవితాలను మార్చుకోలేక దానికి బలి అయిపోతారు.

పై రెండురకాలూ గాక సామాజిక విప్లవాన్ని సర్వశక్తులతోనూ ప్రతిఘటించే అమిత బలసంపన్నమైన వర్గం ఉన్నది. ఆయుధాలూ, ఆయుధధారులూ వారిసొత్తు. వారి ప్రతిఘటన బలాన్నిబట్టి రక్తపాతం జరుగుతుంది– జరుగుతూనే ఉన్నది

ప్రస్తుత పరిస్థితిలో ప్రజలకు తమ జీవితం గురించి నిజం తెలియాలి. రాబోయే సమాజం గురించి తెలియాలి. అందులో వారు నిర్వహించే పాత్రా, దాన్ని అవతరింప జేయటంలో వారు నిర్వహించిన పాత్రా అర్థంకావాలి.

ఈ జ్ఞానం ప్రజలకు ఎలా కలిగేటట్టు. వారిలో ప్రాథమిక చైతన్యం కలిగాక ఆచరణజ్ఞానానికి తోడవుతుంది కాని ఆ ప్రాథమిక చైతన్యం ఎలా కలుగుతుంది? సినిమాలు కలిగించవు. రేడియో ప్రసంగాలు కలిగించవు. ప్రాచీనసాహిత్యం కలిగించదు. వర్తమాన సాహిత్యంలో చాలాభాగం నిష్ప్రయోజనం. (అదికూడా మతంతో పోటీ చెయ్యగల నల్లమందే.) ఈపని విప్లవ సాహిత్యంవల్లనే కావాలి.

విప్లవానికి పూర్వం చీనా మనదేశంకన్న ఏమంత ముందులేదు. అలాంటి దేశాన్ని విప్లవాభిముఖం చెయ్యటానికీ, నూతనదశకు చీనా ప్రజలను సుముఖులను చెయ్యటానికీ మహాయజ్ఞం జరిగింది. యుద్ధాలూ, ప్రతీపశక్తుల విధ్వంసమూ, రక్తపాతమూ మాట అటుంచి, విప్లవం విజయవంత మయాకకూడా సాంస్కృతిక విప్లవం అనేకదశలలో జరిగింది. మావో ప్రజల మనస్సులనేగాక కేడర్ల మనస్తత్వాన్ని కూడా మార్చటానికి అపార కృషిచేశాడు. "మావోథాట్" విస్తృతంగా ప్రచారమయింది.

ఇదంతా "బ్రేన్ వాషింగ్" (భావక్షాళన) అని ప్రచారం చేశారు.

ప్రతి దేశంలోనూ, ప్రతికాలంలోనూ ప్రజలకు ఏదోవిధమైన భావక్షాళన జరుగుతూనే ఉన్నది. మతాన్ని మించిన "బ్రేన్ వాషింగ్" మరి ఉండదు. దాన్నిమనం కనీసం మూడువేల ఏళ్లుగా అనుభవిస్తున్నాం. అందుకే మనదేశంలో ప్రత్యక్ష జీవితం కన్న లోకాంతరాలు యథార్థం, ఈజన్మకన్న పూర్వజన్మ ఎక్కువ నిజం, మనిషికష్టాలకు మనిషే బాధ్యుడు, వెంకటేశ్వరస్వామి ఉద్యోగాలిస్తాడు, ఆరోగ్యం ఇస్తాడు, డబ్బు ఇస్తాడు (డబ్బు పుచ్చుకుంటా డన్నది అముఖ్యమైన నిజం!), ఎన్నికలలో గెలిపిస్తాడు, చెత్త పిక్చర్లనుకూడా కనీసం నూరురోజులు నడిపిస్తాడు.

మన దిక్కుమాలిన సమాజంలో జబ్బుచేస్తే ఆదిగాలి అనో, చేతబడి అనో అనుకునేవాళ్ళు లక్షల సంఖ్యలో ఉన్నారు.

ఈ ప్రజలను శోషకజనులకుకాదు సరేగదా, ప్రజాస్వామ్యానికైనా అనుగుణంగా తయారు చెయ్యటానికి ఆవడిసోషలిస్టు పాంథికులు ఏం చేస్తున్నారో తెలుసుకోవాలనుకోవటం తప్పుకాదు. ఏమీ చెయ్యటం లేదనుకోవటం కూడా తప్పుకాదు. ఎందుచేతనంటే ప్రజల అజ్ఞానాన్ని బలపరచటానికి ఎన్నికల సమయంలో మరింత తీవ్రకృషి జరుగుతున్నది గనక.

జనసామాన్యంలో క్షాళన కావలసినది చాలా ఉన్నది. వారి జీవితానుభవాన్ని ఆధారం చేసుకుని రచయితలు ప్రజలనుపీడించే తప్పుడు ఆలోచనా విధానాలను తప్పక క్షాళనం చెయ్యాలి. అందుకు ఇప్పుడు జరిగేకృషి ఎంతమాత్రమూ చాలదు.

## సోషలిజం వస్తోంది

దండు ఎర్రన్న

తప్పుకోండి
తప్పుకోండి
సోషలిజం వస్తోంది
సోషలిజం వస్తోంది
పరుగెత్తుకొస్తోంది
బరువెత్తుకొస్తోంది
పైన పడవచ్చు
పళ్ళు విరగొచ్చు
సోషలిజం వస్తోంది

సోషలిజం వస్తోంది
మొన్న మద్దినాలకె
తరలి రావల్సింది
దోవలో పాకిస్తాను
కాపు కాస్తేను
దూరాన చైనాలో
బాంబు పేల్తేను
మధ్యలో బంగ్ళదేశ్
మొరలు పెట్తేను
ఇదిగొ వస్తానని
ఊరు వదిలింది

మొన్న మద్దినాలకె
తిరిగి రావల్సింది
నిన్న పొద్దుటేళకు
బిర్లాను పీచమణచాల్సింది

నిన్న మద్దినాలకు
టాటాను తన్నిపంపాల్సింది
పొద్దుగూకే సరికి
పెద్దసీలింగు ఉరికి రావాల్సింది
గాంధి చావకమునుపె
ఖాదిచక్రంలో వాలిపోవాల్సింది
నెహ్రూ పోకముందె
లేతగులాబీల్లా రాలిపోవాల్సింది
నడుమ నక్సల్బరి వచ్చి
పిడుగు లేయకపోతే
నిసమరేత్రికి వలువంత
సోషలిజం వొలిచివుండేది

కంగారు పడకండి
ఇంట ఎండారిపోరండి
ధర్మస్థాపన కోసం
జాతి మొండారిపోయినా
పొరుగు 'బీదల'కోసం
రక్తమాంసాలు యిద్దాము
బంగ్లా రిలీఫుకు
బారిపస్తులే ఉందాము
పరోపకారానికి
నిండుప్రాణాలె ఇద్దాము

పాతదేశం మనది
గీతధర్మం మనది

పులిమేక లొకచోట
తాగితూలిన శాంతమ్మ మనది
మన ఓర్పె మనధనము
మనధనము పరులకోదార్పు
ఉన్నవాళ్ళ దుంచుటకై
ప్రోగ్రాములు వేశినాము
లేనివాళ్ళ చందలిస్తే
కానిమాట ఏమున్నది?
లాటరీలు, సేవింగ్సులు
బ్యాంకు బాండ్లు, ప్రయిజు బాండ్లు
ఏకధాటిగ కొంటువుంటె
రాకపోవున రాజులాగ
చల్లపల్లి మోజులాగ
సోషలిజం షోకుచేసి.

## ఆచూకీ తెలిపితే బహుమతి

శివకుమార్

చామనచాయ, నూనూగు మీసాలు
వచ్చీరాని గడ్డం, బహుభాషా పాండిత్యం
చర్చకు దిగితే అదరగొట్టే తర్కం
సగటు దేహ పరిమాణం.
ఆచూకీ తెలిపితే బహుమతి
పది ఎకరాల సుక్షేత్రమైన భూమి
సాగు ఖర్చులకింద పది వేల నగదు.

లంచాలతో సహా అమరే
సుఖమైన ఉద్యోగం,
కట్నంతో అందమైన భార్యా
అష్టకష్టాలు పడైనాసరే
అన్నీ సమకూర్చే తల్లీతండ్రీ
ఏదీ పట్టించుకోక పరారైన వ్యక్తి
ఆచూకీ తెలిపితే బహుమతి.

వేషం విషయంలో పట్టింపు లేదు
భాష ఎక్కడికక్కడ బనాయించగలడు
తిండి, షడ్రసోపేతమైనా
తలిద అంబలి అయినా ఒకటే
అదీ దొరక్కపోతే పర్వాలేదు
ఆచూకీ తెలిపితే బహుమతి

కండల్లో గతతరాల కష్టపు బలం
గుండెల్లో కల్తీలేని నెత్తురు బలం
మనసులో ఆశయాల బలం
భవిష్యత్తుపై విశ్వాసపు బలం
గుండెలు తీసిన బంటాతడు
ఆచూకీ తెలిపితే బహుమతి.

నక్సల్‌బరీ, శ్రీకాకుళం, ములుగు
నల్లమల, కేరళపర్వత అటవీ సీమలూ
కాలిబాట మలుపుల్లో పహరా,
మాటువేసి పొంచినగానీ,
పులిలాంటి మనిషి
ఆచూకీ తెలిపితే బహుమతి.

కలకత్తా, హైదరాబాద్, పాట్నా
ఏ నగరంలోనైనా వీధి మలుపుల్లో
చేతి బాంబుతో సాక్షాత్కారం
వెరపెరుగని మనిషి ప్రమాదకరం
ఆచూకీ తెలిపితే బహుమతి.

అతడికి దేశంలేదు, జాతిలేదు,
ప్రాంతం అసలేలేదు,

అతడే లుముంబా, గువేరా
గ్రిమాన్, సత్యం, పాణిగ్రాహి,
హైదరాబాద్ బారికేడ్ల వద్ద నిలచిన
అనామక యువకుడు
ఆచూకీ తెలిపితే బహుమతి.

సజీవంగానైనా, నిర్జీవమైనా
ఆచూకీ తెలిపితే బహుమతి.

షరా:— పులినిపట్టే యత్నంలో నష్టాలు వేటగాళ్ళే
భరించాలి, ఆ పిమ్మట కలిగే విపత్తులకు
ప్రకటనదారులకు పూచీలేదు.

## మంచికోసం

—సుబ్బన్న

"పోలీసూ నువ్వెప్పుడైనా అప్పు చేసావా ?"
"చేసాను"

"రూపాయికి పదిపైసలు వడ్డీ యిచ్చుకున్నావూ ?"
"ఆ!"

"అప్పిచ్చినవాడు నీముందే నీ పెళ్ళాంతో సరసాలాడుతోంటే చూస్తూ వూరుకోగల్గేవా ?"

"మాట్లాడకుండా నడు - నువ్వెక్కడికెల్తున్నావో తెల్సా, కటకటాల వెనకాల్కి"

"బాబాయి, నీ చేతిలో వుండే రైఫిల్‌తో, నీకు కాల్చిపారేసే లైసెన్సుంటే కాల్చిపారేయవూ ?"

"యిక నోరెత్తకు..." బయనట్‌తో పొడిచాడు

"అదే నీకూ నాకూ తేడా నాచేతిలో వున్నదాంతో నేను అన్యాయాన్ని నరికి పాతరేసాను- నాకోసం కాదు- నాలాంటి మరో పదిమంది మంచికోసం."

## పోలిక దొరకకుండా

పి. రాజారావు

నిప్పు రవ్వలా ఎగసి
ఈ అగ్నికి ఆజ్యమై నిలచి
శత్రువు పోలిక దొరక్కుండా కాల్చు.

పట్టం కట్టుకున్నాడు వీడు
వీడుదొర
నిన్ను దోచినవాడు
నీతరాన్ని దరిద్రిమట్టం చేసినవాడు
నీ కాలేకడుపుమీద మేకులు కొట్టినవాడు
నీ నోటిని చీకటితో కుట్టినవాడు
బూడిదలో నిన్ను కప్పెట్టినవాడు
నువ్వు చల్లారిపోయావనుకుంటున్నాడు

లే, లేచి
నీ చేతికందిన అమ్ముతో
వాడి రొమ్ము చీల్చు.

## కుర్చీ క్రింద కుంపటి

పంజా

కుర్చీ క్రింద కుంపటి
ఇప్పుడే రాజుకుంటోంది.
దాన్నక్కడ ఎవరు పెడితేనేం?
సరైన చోటనే ఉంది.
పెట్రోలు తెచ్చిపొయ్యండర్రా
కుర్చీని కాల్చెయ్యాలి.

తాతలనాటి కుర్చీకదా అని
అభిమానంతో వుండనిస్తే
ఇల్లంతా ఆక్రమించింది
ఇరుగ్గా ఉంది.
కుర్చీవల్ల నల్లుల సంతానం
దారుణంగా పెరిగిపోతోంది.
అదీకాక కుర్చీ
కూర్చున్న వాడికే పరిమితం.
అందుకని దాన్ని మట్టుబెట్టి
అందరికీ చాపల్ని తెండి.

## నా కలం శూలమై...

వి. కమలాకర్

ఆవేశ హృదయం
ఇన్నాళ్ళూ ఆలోకించి, ఆలోచించి
ఘూర్ణిల్లినపుడు
అక్షరాలు బుల్లెట్లయి
తుపాకి గొట్టంలోంచి వచ్చి
మీ అన్యాయాలను బద్దలుచేస్తయ్.

ఇన్నాళ్ళూ
పదవుల పాదాలకింద
ఒదిగిపోయిన హృదయాలు
ఎక్కుపెట్టి వేసిన బాణాలై
ఒక్కసారి అన్నివేపుల్నించీ దూసుకవస్తే
దిక్కులేని చావు చస్తారు మీరు.

చచ్చురాతలతో పుచ్చిపోతున్న చెయ్యి
క్షాళనం చేసి
సత్యాన్ని తప్ప ఏమీ చూడని
సాహసాన్ని తప్ప ఏమీ పలకని
కలంతో సాయుధభావాన్ని ప్రసరించి
శూలమై మీ గుండెల్లో దిగినపుడు
చుంచెలుకల్లా ఇన్నాళ్ళూ
మా నేలను తవ్వుకొని పోసిన
మట్టికుప్పల కలుగుల్లోనే
కూరుక పోతారు మీరు.

కథ:

# "చీకటోళ్లు"

—అరుణకుమార్

ఒరే సత్యం. ఓసారి జైలు చూచివద్దాం అన్నాడు రామారావు. సరే పద అని జైలుదగ్గర కెళ్ళాం.

ఏమిటది? రామారావు.

జైలుగోడ.

అంటే??

నిరపరాధుల్నీ, దేశభక్తుల్నీ, దోపిడిని వ్యతిరేకించిన వారినీ. దోపిడీకి గురయి మూల్గులు పీల్చివేయబడుతున్న పేదల ఆశల. ఆశలగొంతుల. గొంతుల కేకల– కేకల మానవతా పవిత్ర మూర్తులనూ. దోపిడీని ప్రశ్నించటం నేరమనీ, తమపాలన కద్దు వుండరాదనీ-ధనిక మదాంధులు బంధించినది– ఈగోడ వెనకాతలే. ఈగోడ న్యాయానికీ అన్యాయానికీ, స్వాతంత్ర్యానికీ పీడనకూ సరిహద్దు. ఈగోడ చీకటికీ వెల్తురికీ మధ్య పగలనికోట. ఈగోడను కట్టినదీ– అందులో బందీలయినదీ– వాళ్ళేవాళ్లే నిరపరాధులు. నిర్భాగ్యులు నిర్భాగ్యులే. కూటికోసం కూలీలు గోడలుకట్టారు. కూలివాళ్ళ కూలి చాల దన్నవాళ్లకూ ఆ గోడల వెనకాతలే గోరీలు కట్టబడ్డాయి.

ఈగోడ లెన్నాల్టివి!? రామారావు సందేహం.

ఆలనాడు అడవిలో జనమంతా బట్టల్లేకుండా నగ్నంగావుండి, శ్రమకు దొరికింది తలాకాస్తంత తిన్ననాడు లేవు, లేవీగోడలు. దొరికిన ఆహారం సమానంగా తీసుకొన్న నాడు లేవీగోడలూ– గోడల వెనకాతల పీడలూ– వానిజాడలూ. అన్నీ- అన్నీ స్వంత ఆస్తితోనే ప్రారంభమయ్యాయి. వున్నవాడికీ లేనివాడికీ మధ్య గోడల్లేచాయి. లేనివాడు "బానిసచాకిరీ ఎన్నాళ్ళని" అడిగితే గోడవెనకాతల వేయబడ్డాడు. బందీలయిన బానిసల మధ్య ఆ మరణపోరాటం యజమానుల వినోదంగా వుండింది ఒకనాడు. బానిసలనేమ యినా చేసేందుకు యజమాని కనుసన్నచాలు. తదువాత తరువాత రాజుగారి ఆజ్ఞతో– ధర్మపాలనకోసమనీ, ప్రజారక్షణకినీ, దేవుని ఆజ్ఞ కారణమనీ– రాజ్యపు పునాదులు పెకిలించి వేయబడకుండా కాపాడేందుకు– ఆకలి జనత గొంతులు మూసేందుకూ,–

చీకటికొట్లు— పాతాళగృహాలు— ఒంటిద్వారాలు— ద్వారాలకు రాని తాళాలు. నోరులేని తాళాలకు నోరుతెరువని భటుల కాపలాలు— ఇవన్నీ అనాడు.

మరినేడో ??

న్యాయాన్నీ ధర్మాన్నీ పెట్టుబడినీ, ధనికవర్గాల్నీ కాపాడేందుకు కోర్టులు- విచారణలు- శిక్షలు- కడకు పేదల గొంతులకు గోడల వెనకాతల ఉరితాళ్ళు.

గోడలలోపల మరేమిటున్నది ??

చిన్నకొట్లు- పెద్దకొట్లు— చిన్నచీకటి, పెద్దచీకటి, చిన్నతాళం పెద్దతాళం, చిన్నవి పెద్దవి— చిన్నవి పెద్దపెద్దవి— దేశాన్నీ- స్వాతంత్ర్యాన్నీ మింగివేసేంతవి— చీకటిగదులే నాయనా- చీకటిగదులే.

జైలులో ఇంకా ఏమున్నది ??

చువ్వలకొట్లు చువ్వల వెనకాతల చీకటి. చువ్వల్లోంచి చీకట్లోకి సన్న సన్న వెలుగు. ఆ చీకట్లో వెలుగులో వాళ్ళే సన్నసన్నబడిన జీవాలు.

అదుగో కాలికి కడియంతో ఎవరో ఖైదీ- మిగతావాళ్ళతో జైలుబయట శుభ్రం చేయిస్తున్నాడు- అతనికథేదొ అడుగుదాం పద

నీపేరు ?

మల్లేసు.

జిల్లా ?

ఆదిలాబాదు.

ఏం కేసు ?

మర్డర్ కేసు.

ఎవరిని ?

ఇంకెవర్ని ?— మా భూసామినే.

మల్లేసూ— ఇందా- ఈ సిగరెట్టు కాల్చుకో— అసలు మొదట్నుండీ ఏం జరిగిందో నీగొడవంతా వివరంగా చెప్పు వినాలనివుంది.

మేం నల్గురం అన్నతమ్ములం ఒక్కతల్లికి. ఎవల్లమాల్లం వేరుపడ్డం. నేను కడపోడ్ని. ఓరోజు నేను జంగిల్‌కెల్లి కట్టెలుతెచ్చినా. పొద్దీకి బండిడిసినా, నాభార్య సెప్పింది. ఇల్లాగ ఇల్లాగ బావను బూసామి కొట్టిచ్చిండని. అమ్మా నాన్న వాల్లని— ఏందే అమ్మా ఏటి జరిగిందంటే ఎవల్లూ సెప్తల్లేదు. అన్న ఏడుత్తున్నడు. ఓరినియమ్మ-

గొంతదానికి ఏడుత్తవేం మగాడివి- సప్పుడు సేయకవూరుకో పగలుసూద్దం అని పెద్దన్నకాడికెళ్లేను ఆడు సర్పంచితోటీ, పోలీసోడితోటీ సెప్దమన్నడు. మనకాడ పైస ల్లేవు- కోడిపెట్టల్లేవు- అందుకని సర్పంచిలేడు- పోలీసోడు లేడు- సప్పుడు సేయకు మని- మన్నాడు పొద్దుటేల అడివినుండి తెచ్చిన బండికట్టెలూ- సంతలో అమ్మేసినా, వచ్చిన తొమ్మిది రూపాయలూ ముడుపునగట్టి నే బండెనకాలవత్తన్నా. బండినేమొ నాటు బండల పోరగాలు తోల్తన్నరు. ఆయేలప్పుడే బూసామి గుమాస్తా బండెదురుగా వత్త న్నాడు నడిరోడ్డుమీన. ఆకలిపేనంమీన వున్నయ్యేమొ కోడెలు బుసలుకొట్టినయ్. ఆడు బయంపడి తప్పుకొన్నడు. పోరగాళ్లు గపీమని నవ్వేసినారు. ఆడు మండిపడి "కొవ్వు పట్టిందేటిరా లంజకొడకా- మీదకితోలింతన్నావు" అనీడండి. అదుగో ఆ ముతకమాట మల్లీ అంటివంటే మక్కెలిరుగుతాయని సెప్పాను." అప్పుడు ఆడు "నీయమ్మ లంజ- నీయమ్మమ్మ లంజ ఏంసేత్తావురా పకీరునాయాలా" అనీడండి. నాయన్నాయనా ఓకోప మొచ్చిందండీ- అన్నెం పున్నెం ఎరుగని అమ్మని అన్న లంజకొడుకొని మరింక సెమించకూడదని- సేతికర్రతో ఆడిని సితకబాదేను. నాయాలు పంచె వొడిపోతన్నా పారిపోయేడు. అగొడవ ఆడతోసరి. మరికొన్నాల్లు పోయేక అన్న బండి తోలుక వత్తంటే బండలడ్డుపెట్టేరు బూసామి మనుసులు. అన్నబండి వాగ్గేసి వురికొచ్చిండు. అందరం ఎల్లి బండితోలుకొచ్చేసినాం.

నాల్నెల్లు పోనాక సేలోవున్న నాగండ్లను (మావి మూడు; పిళకాయనివి రెండు) ముక్కలుసేసి బురదలో తొక్కేసినారు బూసామి మనుసులు. పొద్దున్నే ఎవడు సేసిండ్రా ఏటిసంగతని- వూరు పబ్లీకంతా గుమస్తా ఇంటిమీనకే పోయినాం. ఆతొత్త కొడుకు పారిపోయిండు. పొలమంతా గాలిచ్చగా గాలిచ్చగా నాగళ్ళముక్కలు దొరి కాయి. ఇది జరిగిన నెల్లాళ్ళకు పొలం దున్నుతావుంటే- కోడెదూడకు జబ్బయినాది. కోడెపాణం మంచిగలేదని జోడుని అక్కడ్నేవదలి- అల్లు సెప్పిన మందూ- ఈల్లు సెప్పినమందూ ఎతికితెచ్చినా. ఇంతలోకి రెండోదూడ గూడా కుంటుతావుంది. ఏందిరా దేముడా అనిసూత్తే దాని కాలినిండా రగతం రగతం- ఈపంతా దెబ్బలేదెబ్బలు, సుట్టూ సూత్తే పక్కపొలంలో బూసామి మీసకట్టు దువ్వుతున్నాడు. గుమాస్తా ముసిముసిగా నవ్వుతున్నాడు. ఏటి ఈపని అని అడిగితే- గట్టుదాటి నాపొలంలో అడుగేత్తే నీసనీ అంతేననీరు. నోరులేని ఎద్దు- గట్టుదాటిందీ లేనిదీ ఎవడికెరిక ?? ఒకటికి రెండెద్దులూ మూల్నపడ్డాయి, నానడ్డిరిగిపోనట్లయినాది. ఎన్నాల్లనుండో నన్నప్పులపాల్జేసి నానేలనీ కలిపేసుకోవాలన్న బూసామి పన్నాగంగ మనానికొచ్చినాది. మరిప్పుడు ఒంటిగాడ్ని సప్పుడు సేయగూడదని- ఇంటికెల్లిపోనాను.

ఆరాత్రి- సీకటిదొరల దలం మావూరొచ్చినాది. మకాం నాయింట ఏసినారు. గంత గంజిపోసినా తాగినారు. ఆనక బూసామిగాడి దుర్మార్గాలన్నీ సెప్పినా. రాసుకొన్నారు పుస్తకాల్లో. పేదరైతులకంతా ఫిలిపించినారు. అన్ని జిల్లాలలోనూ పేదలంతా ఇలాగే దోచుకోబడుతున్నారని చెప్పారు. మన పేదోళ్లంతా. ఒక కంచెబద్దలాగా- ఒకే కట్టుమీన వుండాలని సెప్పినారు. తొందరపనిమీన పక్క జిల్లాలోకెళ్లన్నాం. మళ్లీ కొద్దిరోజుల్లో వచ్చి, సంగం పెట్టుకొని- సంగంద్వారా ఆడిపనిబడ్దాం. అందాక జాగరత్తగ బూములు దున్నుకోండని సెప్పి ఎల్లిపోనారు. మర్నాడు పోలీసుపటేలు బూసామి ఇంటికాడకి పిలిపిచ్చేడు. సీకటోళ్లని జేరనిత్తే- తలదీత్తానన్నాడు పటేలు ... సానాసేపు సానాసానా బయంమాటలు సెప్పినారు. అయితే అస్సలుమాట- బూసామిది, అదేటంటే– "ఏటిరా సీకటోళ్ళకు అన్నమేఁనా లేక ఆడదాన్నీ అప్పసెప్పినావా? అదేదొ నాబోటోడికో- పటేలుగారిలాటోడికో అయితే నీబతుకు బావుంటది. ఆళ్ళేటిత్తారునీకు. జెల్లలూ- సీకటికొట్లూ తప్ప" అనీడండి. మరి దురుమార్గపు తొత్తుకొడుకు లిద్దరూ కూడినారుగదా నాబంలేదని సప్పుడుసేయక వచ్చేసినాను.

ఆ మరునాడు, ఆ మరునాడే సేలో బూసామి నా ఆడదాని సేయట్టుకున్నాడు. అది ఇడిపించుకొని ఇంటికొచ్చేసి- "నా సేయన్నాకోసేయి- నేదా ఆడితలేనా తీసేయి- నేదునేదంటే మరో పరువున్న మనుఁవు సూసుకుంటానన్నది". "హాఁ నే బతికుండగానే మరోమనుఁవా? నే బతికుండగానే బూసామి అలనాడు ఆడన్నంతపనీ సేత్తాడులా వుంది. మరింక సీకటోళ్లగురించి అగితే నాబంనేదు- నేదని. పిచాకు జేబులో ఎట్టుకొని పడుకొన్నా. అమెన్‌టానా (పోలీసు స్టేషన్)కు దొరకకూడదనీ ఆలోచన సేసినా. రాత్రికిరాత్రే బూసామిని ఖతంచేసినా. నెత్తురుదెచ్చి ఆడదానికి తిలకంపెట్టేసి జంగిల్ లోనికి పారిపోనాను. మరుసటిరోజు అన్నలందర్నీ అరెస్టుచేసినారని తెలిసి- నేనే అమీనుసాబు దగ్గరకెల్లి. సంపింది నేను- నన్నుకొట్లో ఎట్టి- అన్నల్నీ వొగ్గిమన్నాను. అట్టాగేనన్చెప్పి అన్నలతో నన్నూ లాకప్‌లో తోసిండు.

మరుసటిరోజు బూసామికొడుకు ఏయిరూపాయలిచ్చి- అందర్నీ ఇఁకించమనీడు. ఆయాల సాయంతరం. నలుగుర్నీ బయటికొగ్గేసి పరసనే నించోమనీరు. నాలుక్కాబెలిచ్చి తలకొకటీ పట్టుకోమనీరు. పొటోలమీన పొటోలు లాగేసినారు. డాకటేరుగూడ చినాకత్ సేసీ కట్టెలదెబ్బలకే సచ్చినాడని రాసినాడు. అమీను సుతారిపనోళ్లని పిలిచి– ఈళ్ళని కోర్టులో గుర్తుపట్టాల బాగా సూడమని సూయించినాడు. ఆనక వరంగల్లు కోరుటుకంపినాడు. అక్కడ సాలెకోటయ్య, పోలీసుపటేలు, నూకల భీమయ్య, అడి

కొడుకే దుర్గయ్య. మరి.... వోలేటి బుచ్చం- అంతా సంపటం సూసినామని గవాయి సెప్పేరు. ఈళ్ళంతా మావూరి వాళ్ళు కానేకాదు. అయినా గవాయి ఇచ్చేరు. జడిజీ-పెద్దాయనో మరి చిన్నాయనో బరబరా రాసేసుకున్నడు. అకోరుటు తంతు అయిపోనాక జడిజీబాబు- మీమీద నేరం రుజువయింది. అందరికీ సిక్సలేత్తున్నా. ఏటన్నా సెప్పుకుంటే సెప్పుకోమనీడు.

మరెలాగూ సిక్సలేత్తున్నాడని సెప్పినా.

జడిజీబాబూ! పేదోల్లం. సంపినాది నేను. ఆడి అన్నాయాల్ని బరించలేక సంపిన మాట నిజమే. మరి మీతీరువులో వాడి అన్నాయాల గొడవేనేదు. నేకపోగా ఆడి అన్నాయాల కారణంగా ఆడుసత్తే- నాసంసారాన్నీ- అన్నలు ముగ్గురి సంసారాల్ని ఎండపాలు సేయవద్దన్నాను. అమ్మ, అయ్య- ముసలాళ్లు- మట్టిలో బంగారం పిండి మమ్మల్ని పెంచినారు. వయసుమీన పడివున్నారు. వాల్లకి కూదేసేటందుకు- మా అందరి పెల్లాల మానాలేన్నా బూసాముల బారినుండి కాపాడేందుకు. ఒక్కడ్నేనా ఒగ్గేయమన్నాను. మా పిల్లాల్నీ, పెళ్ళాల్నీ బూసామి కప్పజెప్పి మమ్మల్ని కొట్లో ఏయటం అన్నాయం బాబూ. నీకాల్మొక్కుతా ఒక్కడ్నంటే ఒక్కడ్నేనా ఒగ్గేయమన్నాను.

ఏటో గీకేసుకొని- నలుగుర్నీ జీయితకైదు నెట్టేసి ఎల్లిపోనాడు జడిజీబాబు.

అమ్మ, నాలుగెకరాలమ్మి- పట్నంలో బారిష్టరు నెట్టివాదించినా పైకోర్టూ-కిందిదే ఖాయమందట. నాయం పైనా, కిందా ఒక్కనాగేవుంది. మరేంసేయాల. లోపల మేం కుల్లిసత్తన్నాం. బయట అళ్లు మాడిసత్తన్నారు. అదిబాబూ సంగతి. అయితే తండ్రీ దరమదాతగందా జడిజీబాబు మరదేటి, అలాగ సిక్సలేసినాడు. ఈ నేలమీన పుట్టిందగ్గర్నుంచి సచ్చిందాకా సాకిరీసేత్తన్నాం. బంగారపు దాన్నెపుగింజలు పండిత్తన్నాం. మేం గంజినీల్లుతాగి- పట్నపుబాబులకి గింజలంపుతున్నాం. దేశమంతా తినేది నాబోటోడు నాబోటోడు రెక్కలు ముక్కలుసేసి పండించిన పంటలేగందా! మరి మాకుగాని నాయం అదెలాంటి నాయం? నాకు ఏతావాతా తేలిందేటంటే- ఈ రాజ్జెంలో మా బూములు, గేదెలు, మావికావనీ- మా సంసారాలకు రచ్చనలేదనీ- ఎర్రటోపీలూ- బూసాములూ- జడిజీలూ మాకు నాయం సెప్పరనీ- అన్నాయం సేత్తారనీ- మా కట్టాల్ని ఇనుకొనేదీ, మమ్మలను కాసుకునేదీ, మాకు సరయిన నాయంసెప్పేదీ, మా బతుకుల్నోదరిజేర్చేదీ-

మానేల మాకప్పజెప్పేదీ- అఖ్ఖ- ఆళ్లేబాబూ- ఇందాకల సెప్పేనే- మా గంజినీల్లతో మాకన్నీల్లు తుడిసేందుకు ఆయాల వచ్చిన సీకటోళ్ళే. అన్నాయానికీ, దొంక గవాయిలకీ, దురుమార్గాలకీ ఆళ్లే సరయిన సమాదానం సెప్పాల. ఈయేలకాకుంటే రేపయినా- అన్నమాట పెకారం సీకటోళ్లు రాకమానరు, దురుమార్గపు నాయాళ్ల పనిబట్టకమానరు. ఆయాల మా రైతులంతా సుఖపడకా మానరు. ఆయాల మానేల మేమే ఏలుకొంటాం. అందువలన సీకటోళ్లంటే బూమాతబిడ్డలు. ఆళ్ళు సల్లింగావుంటే నాలాటోళ్లకేటిదిగులు బాబూ. రాజ్జెమే మారిపోతది. నా ఏదాంతానికేటిగాని మారాజా- ఏళయింది. మరి సెలవని వెళ్ళిపోయాడు.

ఒరే సత్యం కొంచెం బుర్ర వేడెక్కింది. ఇంక జైలుగోల చాలుగానీ- కాసింత కాఫీ తాగుదాం పదమని బయటికి లాక్కొచ్చాడు రామారావు. కాఫీ తాగుతుండగా రామారావు ప్రశ్న. ఒరే చీకటోళ్ళని దొరికినచోటల్లా కాల్చిపారేస్తున్నారుగదా? మరి మల్లేసులాటోళ్ళ ఆశలేమవుతాయి? వీళ్లగతి ఏమవుతుందంటావు?

ఏమవుతుంది? ఆకలి సృష్టించబడింది. దానికి పుట్టేది ఒక్క టేబిడ్డ- అదే విప్లవం! అందాకా చాలా రిహార్సల్సు జరుగుతాయి. అందువలన రిహార్సల్సుకే భయపడకు. ఇంకా ముందున్నది సూర్యోదయానికి వేళ. ఆనాడు అడవుల్నుండి అవనికంతా నిర్మల నెత్తుటిమడుగులు దాటి సత్యంమార్గాన భాస్కరుని వెల్గుల వేగంతో వస్తాయి జగన్నాధ రధచక్రాలు- కనిపించటం లేదా.

అడవుల్లో చీకటి కనుమాటున కదులుతున్న నీడల కదలికలు- జాతికి కొత్త నెత్తురూ రేపటి యువకాశల ఎర్రజ్యోతులూ- నేటి కుష్టువ్యవస్థను కడిపి కుదిపి నిలవేసి, శిక్షించి శాసించే చీకటోళ్ళు రధసారధులైవున్నారు. వాళ్ల పేదల కన్నీటిని తుడుస్తూ, శత్రువు బారినుండి తప్పుకుంటూ- తమ రక్తంతో తడిపి తమ మార్గాన్ని ఎంచుకొని భరత భూమినంతా ఆక్రమించగలిగే ఆ క్షణంకోసరమే మల్లేసులాటోళ్ల ఆశలన్నీ.

"పెద్దమనుషుల్లోవుండే స్వార్థం, సంకుచితత్వం, అసూయ నైచ్యం, ద్రోహబుద్ధి నికృష్ట మానవులనబడేవాళ్ళలో కనిపించవు."

—గోర్కీ—

## భారతీయ తత్వశాస్త్రం - ఒక పరిశీలన

'ప్రజల చారిత్రక దశలకు సంబంధంలేని
తాత్విక చర్చలు మార్క్సిజానికి విరుద్ధం'

—నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

మరొక చక్కని జాతీయవాదపు మచ్చుతునక ఏమంటే?

16, 17 శతాబ్దాల్లో, యూరప్‌లో అభివృద్ధియైన భౌతికవాదం సైతం, సజీవ నిర్జీవ ప్రకృతికిగల తార్కిక సంబంధాన్ని గుర్తించలేక చైతన్యం యొక్క ప్రత్యేకతను నిరాకరించే దశకు వెళ్ళింది. ఐతే 2500 సం॥రాల నాడే భారతదేశంలోని చార్వాకులీ విషయాన్ని వివరించగల్గారు. (పే, 33)

తిరిగి, దీనికి భిన్నమైన సూత్రీకరణ దానిప్రక్క పేజీలోనే- నిర్జీవ, సజీవ ప్రపంచాలకుగల సంబంధాన్ని గతితార్కికదృష్ట్యా వివరించిన చార్వాకులు, జ్ఞానసంపాదనలో యాంత్రిక దృష్టిని ప్రదర్శించారు (పే. 35) (మూడో ముద్రణ) దీన్ని నాల్గో ముద్రణలో రచయిత వుపసంహరించుకున్నాడు.

భావవాద తార్కికులు చెప్పే, అనుమాన, శబ్దప్రమాణాలను త్రోసివేయటంద్వారా చార్వాకులు యాంత్రిక దృష్టిని ప్రదర్శించారు (పే. 34). అంతవరకు మానవుడు సాధించిన తార్కిక జ్ఞానాన్నికూడ త్రోసిపుచ్చారు. (పే. 35)

భారతీయ భావవాదులతో పోల్చినపుడు చార్వాకులది యాంత్రికదృష్టి. యూరప్ భౌతికవాదం— అదీ 16, 17 శతాబ్దాల్లోది— తో పోల్చినపుడు చార్వాకులది అభివృద్ధికరమైన గతితార్కికదృష్టి— ఇది పూర్తివైరుధ్యంతో కూడిన సూత్రీకరణ—

ఇంతకంటె హీనమైన సూత్రీకరణ ఏమంటే,

క్రీ. పూర్వం 6వ శతాబ్దంనాటి భౌతికవాదం, క్రీస్తుతర్వాత 17 శతాబ్దాల అనంతరపు భౌతికవాదంకంటె వున్నతమైందని చెప్పటం— 'తత్వశాస్త్రానికి ప్రాంతీయ, జాతీయ పరిహద్దుల్లేవు (పే. 213) అంటూనే, యూరప్, భారతీయ తత్వశాస్త్రాలకు

పరిహద్దులు గీయటం: ఇది ఎందుకు జరిగింది? రచయితకు భౌతికవాదం ఎడకల జుగుప్సవల్ల.

16, 17 శతాబ్దాల్లోని యూరప్ భౌతికవాదం, అంతకు ముందున్న ప్రపంచం లోని భౌతికవాదా లన్నిటికంటె, శాస్త్రీయదృష్టిలో చాల అభివృద్ధికరమైందని, మార్క్సు, ఏంగిల్స్ స్వయంగచెప్పారు. ప్రకృతి శాస్త్రాభివృద్ధిని, గణితశాస్త్రాభివృద్ధిని ఆ భౌతిక వాదం జీర్ణించుకుంది. పదార్థము, చలనము (Matter and Motion) బునాదిగా, భూమి, ఆకాశపుగోళాల సంచలన సంబంధశాస్త్రాన్ని ఆ భౌతికవాదం, పూర్తిగణనలోకి తీసుకొని ముందుకు పోయింది.

ఐతే, యూరప్‌లోని యాంత్రికాభివృద్ధి దశలో జీవించారానాటి భౌతికవాదులు. వారి పరిసరాల ప్రభావం వారిమీద పనిచేసింది. ప్రకృతి దృగ్గోచరాలను, నాటిసామా జిక జీవితాన్నివారు, యాంత్రిక దృష్టినుండి వివరించటానికి బూనుకున్నారు.

ఐనప్పటికీ, జాతీయవాద ముసుగును తొలగిస్తే, 17 శతాబ్దపు రసాయనిక, పదార్థ, సామాజిక శాస్త్రీయదృష్టి క్రీస్తుకు 6 శతాబ్దాల ముందున్న తాత్వికులకుండేం దుకు వీల్లేదని స్పష్టపడుతుంది. కాని, ఈ రచయిత వీరిద్దర్నిపోల్చి, చార్వాకుల జ్ఞానా భివృద్ధి 'గతితార్కిక భౌతికవాదానికి దగ్గర్లోవుందని చెప్పబూనటం అభివృద్ధి నిరోధక దృష్టి ఔతుంది.

"దారాలన్నీకలిస్తే వస్త్రం ఏర్పడుతుందనీ, గులాబీ పువ్వుకు ఎరుపురంగుంటుం దనీ, వస్తువుకు చలనం వుంటుందనీ, వైశేషికులానాడే, ప్రత్యేక, సామాన్య ధర్మా లను గురించి చెప్పేశారన్నాడు. (పే. 128)

"ఆధునిక గతితర్కం కూడా ప్రత్యేక సామాన్యధర్మాలను గురించి ఇదేవైఖరిని అవలంబిస్తుంది అంటూ (పే. 132) (మూడో ముద్రణలో) ఒక మావో సూత్రీకరణను కూడ జోడించి చెప్పాడు. నాల్గో ముద్రణలో దీన్నుపసంహరించుకున్నాడు. ఎందుకో?

## మార్క్సిస్టు వ్యతిరేక ధోరణి

కమ్యూనిష్టు సమాజంలోని వర్గసంబంధాలను గురించి, తాను వివరంగ చెప్పడం కష్టమని, సోషలిష్టు సమాజంలోనివారు అర్థంచేసుకోగలరని అన్నాడు మార్క్సు.

"జమీందారీ సమాజంలోని ఏవ్యక్తీ ముందుగానే భవిష్యత్తునూహించి పెట్టుబడి దారీ సమాజ సూత్రాల్ని విశదీకరించజాలడు. ఎందుచేత? పెట్టుబడిదారీ సమాజం ఇంక

వుదయించనందున్న- దానికనుగుణమైన ఆచరణ వుండజాలదు గనుక— మార్క్సు ముందుగ వూహించి, సామ్రాజ దశయొక్క ప్రత్యేక సూత్రాల్ని తెలుసుకోలేక పోయాడు" అన్నాడు మావో.

దీనికి భిన్నంగ బలరామమూర్తిగారు ఏమిశలవిచ్చారో గమనించండి.

"వ్యక్తికి సమాజానికీ వైరుధ్యం అనాదిగవుంది. వర్గసమాజంలో మరింత తీవ్ర రూపంలో వుంటుంది. వర్గరహిత సమాజం ఏర్పడిన పిమ్మటనే, వ్యక్తికీ సమాజానికి గల వైరుధ్యం, ఘర్షణరూపం త్యజించి, సుహృద్భావపూరితమైన పోటీరూపాన్ని స్వీకరించగలదు సుదూర భవిష్యత్తులో మాత్రిమే మానవజాతి సాధించగల ఈ లక్ష్యాన్ని. గౌతముడు లీలామాత్రంగ తన "అనాత్మవాదం"లో దర్శించాడా అన్పిస్తూంది" (పే.60)

బానిస సమాజపు చరమదశలోని గౌతముడు, ఫ్యూడల్, పెట్టుబడిదారీ సోషలిష్టు సమాజాలన్నిటిని దాటి, కమ్యూనిష్టు సమాజంలోని వర్గసంబంధాలను దర్శించాడా అన్పిస్తోందట మూర్తిగార్కి. ఆ మహాత్ముడు. ఆనాడే. ఇంక మానవజాతి సాధించలేని లక్ష్యాన్ని తొంగిచూశాడట. ఇది వూహా. ఆలోచనా? లేక ఆచరణా అని తెలుసుకోవటం కష్టంకాదు.

మూర్తిగారి మార్క్సు ఐన గౌతమ మహాత్ముడు, తనకళ్ల ఎదుట జరుగుతున్న మార్పును అర్థంచేసుకో లేకపోయాడనేది చారిత్రక సత్యం. లిచ్ఛవీసమాఖ్యను గురించి ప్రశ్నించినపుడు, వారు నియమాలు పాటించినంతవరకు, ఎవరు ఏమిచేయలేరన్నాడు. నాటి రాచరికపు యౌవ్వనాన్ని ఏమాత్రం గుర్తించలేకపోయాడు. అంతవరకెందుకు? తనరక్త సంబంధీకులైన శాక్యజాతిని. నాశనం చేయటానికి తనకళ్లముందు నుండి పెరుగెత్తిన కోసలాధిపతి గుర్రపుదళాన్ని గురించి నాల్గురోజులు ముందుగ వూహించి, తనవారిని కాపాడుకోలేకపోయాడు. తను గొప్పగ పొగిడిన లిచ్ఛవీసమాఖ్యను నాశనం చేయడానికి, అజాతశత్రువు. తన ఆశీర్వాదాన్ని కోరుచున్నాడని గుర్తించలేకపోయాడు. ఆఖరుకు, తనచుట్టువున్న సమాజంలోని దుఃఖానికి మూలం ఏమిటో తెలుసుకోలేకపోయాడు. అలాంటి గౌతముడు కమ్యూనిష్టు సమాజంలోని వర్గస్వరూపాన్ని లీలామాత్రంగ దర్శించగలడా? అసాధ్యం.

మార్క్సు, ఏంగిల్సులు వేలాది పేజీల వివరణవ్రాసి మనముందుంచిన ఈనాడు కూడ, బలరామమూర్తిగారు, భారతీయ మానవసమాజపు చారిత్రిక దశలను విడదీయలేకపోయారు. ఇక గౌతముడా కమ్యూనిష్టు సమాజాన్ని కనిపెట్టగల్గేది? శాస్త్రీయ గతి

తార్కికవాదంతో స్వల్పపరిచయం గలవారెవరూ, ఇలాంటి నిర్ణయాలుచేయ సాహసించలేరు.

"ఆధునిక యుగంలోని గతితార్కిక పరిభాష గౌతముని కాలానికి ఏర్పడటం అసంభవం" (పే. 57). అందుచేత, గాంధీగారు ధైర్యంగ భగవద్గీతకు అర్థాలు మార్చినట్లు, గౌతముని మాటలకు, నేటి గతితార్కిక పరిభాష చేర్చివేశాడు.

గౌతముని 'దుఃఖం' అనేమాటకు, మూర్తిగారి అర్థం "వైరుధ్యాలు" (పే. 56)

'శోకం' అంటే, అర్థం "ఘర్షణ"

గౌతముడు పదార్థాన్నే త్రోసిపుచ్చాడు. అని మూర్తిగారుకూడ అంగీకరించారు. ఐనా, గౌతముడు 'ధర్మం' అనే పదాన్ని "ప్రవాహ సదృశమైన జగత్‌పరిణామం" (పే. 58) అనే అర్థంలో వాడాడట. 'బౌద్ధధర్మం' అంటే? అది శాశ్వతం అని గౌతముడు నమ్మాడుగదా! ప్రవాహసదృశం ఐతే శాశ్వతమెలా ఔతుంది.

'కర్మ' అంటే మతకర్మకాదు. 'మానవుడు చేస్తున్నపని' అని అర్థం అట.

'నిర్వాణం' అంటే మోక్షంకాదు. 'రాగద్వేష రహితమైన మానసికస్థితి' పదార్థాన్నే (Matter) గుర్తించ నిరాకరించిన గౌతముడు, అచేతన పదార్థంనుండి, చేతన పదార్థం, చేతనపదార్థంనుండి ఆలోచించగల పదార్థం (Mind) అభివృద్ధి ఐందని ఎలా గుర్తించగలడు? ఇది అర్థం గాకుండనే, ఘర్షణ, వైరుధ్యాలు మొదలగు వస్తువుల అంతర్గత తార్కికజ్ఞానస్థాయి నెలా అందుకోగలడు?

పైగా, నాటి ప్రకృతిశాస్త్రాల అభివృద్ధిస్థాయి ననుసరించి గౌతముని జ్ఞానం వుండాలి. పరిణామవాదం కనిపెట్టబడకముందు, ప్రకృతిలోని పదార్థాల అంతర్గత సంబంధంగాని, వాటి పరిణామంగానితెలియదు. ప్రకృతి 'శక్తి' యొక్క రూపాంతరాలు–వేడి, వెలుగు విద్యుత్తు, అయస్కాంత శక్తులు– గురించి ఏమాత్రం తెలియదు. నాటి సామాజిక శాస్త్రాలస్థాయి కూడ అతిప్రాథమిక దశలోవుంది.

ఆ పరిస్థితుల్లో పుట్టిపెరిగిన గౌతముడు, సమాజానికీ వ్యక్తికీగల ఘర్షణనుగురించి ఎలా వివరించగలడు? అసలు 'వైరుధ్యాలు' అనేవి అభివృద్ధికి దారిచేసేవి. బుద్ధుని 'దుఃఖం' నశింపచేయ వీలైనది, కన్క మూర్తిగారి భాష్యం తప్పు.

## భగవద్గీత

స్వల్పోత్పత్తి విధానంవల్ల, ప్రజలకుగాని, మతప్రవక్తలకుగాని, మానవసమాజాన్ని గూర్చిన వివిధ దశలను అర్థం చేసుకోగల జ్ఞానం లేనిరోజుల్లో రచించబడ్డ గ్రంథం

'భగవద్గీత'— నాటి ప్రవక్తలెవరూ, నాటి సమాజపు ఒక్కొక్క దశను మించి అర్థం చేసుకోటానికే వీల్లేదు. ఐనపుడా గ్రంధం, నేటి బహుళోత్పత్తి విధానపు ఆధునిక మానవ సమాజపు సమస్యలకు జవాబివ్వ లేదు.

రాజకీయంగ, భారతీయ తెగలన్నిటిని, ఒకే కేంద్రి ప్రభుత్వం క్రిందికి కొని రాబడిన అనంతరం, కొంతకాలానికి రచన జరిగివుండాలి. ఇది వైరుధ్యాల పుట్ట, మచ్చుకు కొన్ని.

సత్వగుణం దైవలక్షణం. 'నావిష్ణుః' పృధీపతికి సత్వగుణముండరాదు, (అంటే, భగవంతుడైన రాజుకు సత్వగుణం పనికిరాదు).

కామం లేకుండ 'కర్మ'చేయాలి. దానిపేరే 'నిష్కామకర్మ' (వెట్టిచాకిరికిమారు పేరు-) పైవర్గాలు, క్రిందివారికి బోధించేవర్గనీతి

నీవిధిని నీవుచెయ్యి. కాని నీవుచేస్తున్నానని ఎందుకనుకుంటావు? చచ్చేదీ చంపేదీ శరీరమేకాని, ఆత్మకాదు ఈరెండూ వేరుకాదు, అదేజ్ఞానం.

భగవద్గీతను గురించి మూర్తిగారి ఈక్రింది అభిప్రాయాలను పరిశీలించండి.

"భగవద్గీత కేవలం నిర్జీవమైన తాత్విక గ్రంధంకాదు". (పే. 162)

"భారతీయ తత్వశాస్త్రంలో ఏ యితర గ్రంధానికిలేని ప్రాముఖ్యత గీతకుంది (పే. 158)

"భారతీయ తాత్విక పరిణామాన్ని, చరిత్రను శాస్త్రీయదృష్టితో పరిశీలించ దల్చినవారు ఈ గ్రంథాన్ని ప్రత్యేక శ్రద్ధతో చదువుతున్నారు. అదిచాల అవసరం (పే. 158)

"కులవ్యవస్థ విషయంలో గీత రాజీపద్ధతినే అవలంబించింది. కులభేదాలను గుర్తించింది, ఐతే కులద్వేషాలు కూడదనిమాత్రం అన్నది. (పే. 176)

ఇచట రాజీపద్ధతి నవలంబించింది భగవద్గీతకాదు. అతి స్పష్టంగాకులభేదాలుండాలని కోరింది. శూద్రులు, బానిసలు, మిగిలిన కష్టజీవుల్ని 'నిష్కామకర్మ' పై వర్గాలకు చేసిపెట్టమని బోధించింది. పాలకవర్గాల చేతిదోపిడి ఆయుధంగ అతి చక్కని సూత్రాలవల్ల ప్రచారం చేసింది. ఇచట రాజీపద్ధతి నవలంబిస్తుంది భారతీయ తత్వశాస్త్ర రచయిత. సనాతనత్వానికి, అధునాతనత్వానికి మధ్యేమార్గం చూపిస్తున్న తిలక్, గాంధి, వినోబాలను బలపర్చటం ద్వారా ఆపనిచేసి పెడుతున్నాడు, అధునాతన సమస్యల కది పరిష్కారమార్గాలు చూపుతుందని పాఠకుల్ని నమ్మమంటున్నాడు. ఇరవయ్యోశతాబ్దపు ప్రజలజ్ఞానాన్ని చాల తక్కువ అంచనావేసి ప్రబోధిస్తున్నాడు.

భావవాది

ఈ భారతీయ తత్వశాస్త్ర రచయిత భావవాదాన్ని బలపరుచున్నాడా? లేక భౌతికవాదాన్నా అనే విషయం పరిశీలిద్దాం.

"హిందు తత్వశాస్త్రంలోని వివిధ శాఖలకంటె ఉన్నతమైనదిగా శంకరుని అద్వైత సిద్ధాంతం, నేటి భావవాద తాత్విక ప్రపంచంలో గుర్తించబడుతున్నది. భారతీయ తత్వశాస్త్రం అంటే, అద్వైత వేదాంతం ఒక్కటే అను అభిప్రాయంకూడా ప్రబలంగ వుంది. కనుక, అద్వైత తాత్విక సిద్ధాంతాన్ని గురించి శ్రద్ధగ పరిశీలించడం అవసరం. (పే. 114)

శంకరుని మతసంస్కరణ కంటె ప్రధానమైనది ఆయన తాత్విక సిద్ధాంతం (పే. 114) అంటూ ప్రారంభించి, అద్వైతులు తదుపరి అభివృద్ధిచేసిన తాత్విక సిద్ధాంతాల్ని ముందుకుతెచ్చి, శంకరుడు తన జీవితమంత వెచ్చించి చేసిన 'మతప్రచారాన్ని' మరుగున పరుస్తున్నాడు. దేవుడేలేడన్న గౌతమబుద్ధుణ్ణి నీవే దేవుడవు అని వెంటబడ్డ శిష్యబృందం మాదిరిగవుంది ఈ రచయిత భక్తి. ఎందుకంటే,

"నహిసాంఖ్య సమం శాస్త్రమ్
నాపియోగ సమంబలం" అని శంకరుడే స్వయంగ అన్నాడు, కపిలసాంఖ్యమే, శంకరుని 'మాయావాదానికి' మూలం. ఈయన తత్వచింతన 'భ్రమ'తో ప్రారంభం. తాడునుచూసి ప్రజలందరు 'పాము' అనుకుంటారని, అలాగే 'జ్ఞానాన్ని ప్రకృతి' అనుకుంటారని ప్రారంభిస్తాడీయన వాదన, అదికాదు. ఇదికాదు. ఏదీకాదు (నేతి, నేతి), ఆయన దేవుడుకూడ నిరాకారుడు. నిరంజనుడు, నిర్గుణుడు, అలాంటి దేవునితో ఏమి ప్రయోజనం? అని అడిగితే, ఔను, మూర్ఖులకు తెలియదంటాడు. ఈవిధంగ ఈయన వాదన అంత 'పద్మసాలీలు - దేవతా వస్త్రాలు' కథలాగ నడుస్తుంది,

మూలప్రకృతి, చైతన్యాలు బ్రహ్మపదార్థమా? లేక ప్రత్యేక పదార్థమా అని అడిగితే శంకరుడు కాదన్నాడు, అవి మరి అనిత్యమైతే, వాటిని బునాదిగచేసుకొని ఎలా ప్రారంభిస్తావు? మరి నీవాదనకు బునాది ఏది? అని అడిగితే 'ఆత్మ'ను ముందుకు తెస్తాడు? మరి సంస్కరణలు ఆత్మకా? మనస్సుకా? లేక మనోబుద్ధులు రెంటికా? సంసారాలు నిత్యమైతే, అనుభవం కూడ నిత్యమే ఔతుంది కదా? లేదు. ఇవన్నీ నశించేవే అంటాడు- (నేతి, నేతి).

మాయ అనేది ఏమిటి ? ఎచటనుండి అని అడిగినవారికి, సూర్యుడు, మంచు ఉదాహరణ చెప్పాడు. ఐతే, అది అనిత్యం ఏలా ఔతోంది ? తిరిగి వస్తోందిగదా ?

జ్ఞానికి ఆత్మదర్శనంతో నామ, రూపాలు తిరోహితాలు- వేదాలు తిరోహితాలు- కర్మలు (సుఖకర్మ, దుఃఖకర్మ వగైరాలు) నశింపు, ఇంక ఏమిలేవు, అన్నీ నశింపే

మిగిలేదల్లా 'అహం'- దీన్ని శంకరుడు 15 భాగాలుచేశాడు. ఇది కార్యకారణ సంబంధానికందదు, వూహకందదు ఆచరణ కంతకంటె అందదు. మరి ఎలా అనుభవించటానికి ? ఎవరు అనుభవించటానికి ?

వేదప్రమాణాన్ని అంగీకరించనివారితో వాదించనన్నాడు. ఉభయులకు వేదాలే ప్రమాణమైతే, వాదనలెందుకు ? అన్నారు బౌద్ధులు.

ఒకే బాదరాయణుని బ్రహ్మసూత్రాలకు, శంకర, రామానుజ, మధ్వాచార్యుల భాష్యాలతో 'త్రిమతాలు' పుట్టించారు.

ఇలాంటి శంకర వేదాంతం, హిందు భావవాద తాత్విక ప్రపంచంలో ఉన్నతమైనదిగ గుర్తించబడుతున్నట్లు ఏవిధంగ నిర్ణయించాడో ఈరచయిత వివరించలేదు.

భౌతికవాదం ఎడ తన జుగుప్సనుకూడ దాచలేకపోయాడు. "చార్వాకులు పాత సిద్ధాంతాలను ఖండించుటలో చూపినశ్రద్ధ తమ తత్వశాస్త్రాన్ని రూపొందించుటలో చూపలేదు" (పే. 37) అన్నాడు మూర్తిగారు. కాని 'హిందువుల చరిత్ర' రచయిత ఐన అక్షయ కుమార మజుందార్ ఇలా అన్నాడు. నాటికాలానికి చార్వాకులది చాల వున్నతమైన తత్వశాస్త్రం. 'నీతి' బునాదిగ ఈశాస్త్రాన్ని నిర్మించారు.

అద్వైతం గురించి ఈయన అభిప్రాయం ఎంత తప్పో, చార్వాకుల తత్వశాస్త్రాన్ని గురించిన అభిప్రాయంకూడ అంతేతప్పు. చార్వాకులకు మంచి తత్వశాస్త్రమే లేకపోయినట్లయితే, ప్రతి జడవాద ధోరణి (Metaphysical School) వారిని విమర్శించకుండ దాటలేకపోయింది. నాటి చార్వాకులది చాల అభివృద్ధికరమైన (advanced philosophy) తత్వశాస్త్రమేగాక, దానికి మంచి ప్రజాదరణకూడ వున్నట్లు, అద్వైతానికంత పలుకుబడిలేనట్లు ఈకిృంది పరిశీలననుబట్టి గ్రహించవచ్చు.

భారతీయ దర్శనకర్తలు కొందరు బౌద్ధ, జైన, చార్వాకదర్శనాలను, వేద చాహ్యలుగాను, మీమాంస, సాంఖ్య, నైయాయిక వైదికాలుగాను విభజించి చెప్పారు.

షడ్దర్శన సముచ్చయమును వ్రాసిన హరిభద్రసూరిగారు బౌద్ధ, న్యాయ, సాంఖ్య, జైన, వైశేషిక, జైమినీయ దర్శనాలను ముఖ్యమైనవాటిగా తీసుకొని చెప్పాడు.

సర్వదర్శన సంగ్రహంవ్రాసిన మాధవాచార్యుడు భారతీయ దర్శనాల్లో 15 టిని ముఖ్యమైనవిగ పేర్కొన్నాడు. 1) చార్వాక దర్శనం 2) బౌద్ధ దర్శనం

3) జైన దర్శనం 4) విశిష్టాద్వైత(రామానుజ దర్శనం) 5) ద్వైత (పూర్ణప్రజ్ఞ దర్శనం 6) నకులేశ 7) శైవ 8) ప్రత్యభిజ్ఞాన 9) రసేశ్వర 10) వైశేషిక 11) న్యాయ 12) జైమినీయ 13) పాణినీయ 14) సాంఖ్య 15) యోగదర్శనాలు.

కొందరు 12 దర్శనాలనే ప్రధానంగ ఎంచుకున్నారు.

వైభాషిక, సౌతాంత్రిక, యోగాచార, బౌద్ధంలో మాధ్యమికభేదాల ననుసరించి నాల్గు దర్శనాలను, జైన, చార్వాకాదిగాగల వాటికే ప్రాధాన్యమిచ్చారు తప్ప, అద్వైతానికొక విశిష్టతనిచ్చిన ఆధారాలులేవు.

కనుక, భావవాదప్రపంచంలో అద్వైత, చార్వాక దర్శనాల్లో దేనికి ప్రాముఖ్యతవున్నదీ దీన్నిబట్టి గ్రహించగలం.

హిందుమత పరిణామాన్నిగురించి మూర్తిగారు ఏనాడు ఆలోచించియుండలేదని చెప్పటానికి క్రింద ఆధారం చాలును.

"అద్వైత సిద్ధాంతంలోని సమానభావం. వివిధ మత ధోరణుల మధ్య సామరస్యాన్ని కల్గించటానికి తోడ్పడ్డది. (పే. 120)

"శంకరుడు ప్రచారం మాత్రమేగాక, అనేకచోట్ల కాపాలిక, శాక్తేయమతస్తులతో ప్రత్యక్ష చర్యలద్వారాను మరికొన్నిచోట్ల రాజుల సహాయంతో బలప్రయోగం ద్వారాను, ఆ మతాలను అణచివేశాడు". (పే. 112)

కాపాలిక, శాక్తేయపద్ధతులు. వెనకబడ్డ తెగలలోను, పేద ప్రజానీకంలోను నాడు ప్రచారంలోవున్న పూజావిధానాలు. శంకరుడు రాజుల అండతో నాశనం చేయించాడంటే, శంకరుని వర్గతత్వం స్పష్టపడుతోంది.

ఇలాంటి, దోపిడీవర్గాల కండగనిల్చిన అద్వైతాన్ని, సమానభావం బోధించిందని సామరస్యధోరణి ప్రచారం చేసిందని చెప్పటం, ఆ మతంపై ఈ రచయితకున్న అభిమానాన్ని తెలియజేస్తోంది. వ్యక్తి అహంను నిరసించినందుకు గౌతమబుద్ధుడు మహాత్ముడు, వ్యక్తి 'అహం'ను రెచ్చగొట్టిన 'అద్వైతం'కూడ చాలగొప్పదే అన్నాడు.

## బుద్ధుడు-బౌద్ధమతం

గౌతముడొకవ్యక్తి. బౌద్ధమతమనేది 'బహుళం' (Compound). గౌతముడు శాక్యజాతిలోని 'ప్రభువర్గం' (noble class) లో పుట్టిపెరిగాడు. ఆవర్గప్రయోజనాల కొరకు కృషిచేశాడు.

బౌద్ధమతం క్రీ. పూ. 6 వ శతాబ్దం మొదలుకొని నేటివరకు లక్షలు, కోట్లాది ప్రజల మేధోసంపర్కంవల్ల అభివృద్ధిచెందిన ఆలోచనావిధానం (thought process)

(సశేషం)

## విద్యా విధానం-చర్చా వేదిక

ఇటీవల ఒకవ్యక్తి కలిసి మీరు సృజనలో మంచిభావాలే చెప్తున్నారని అనిపిస్తున్నది కాని పత్రికలో రచనల్లోని భాషను, చెప్పేపద్ధతిని చూస్తే అది మాకోసం కాదేమో అనికూడ అనిపిస్తున్నది అని అన్నాడు. ఒక విద్యార్థి కలిసి మీ సృజనలో మూడొంతులు మా కర్థమేకాదు అన్నాడు. ఈ విమర్శ చైతన్యవంతులు, జిజ్ఞాసులయిన వాళ్ళనుంచే ఎక్కువగా వస్తున్నదికూడ. ఆత్మ విమర్శ చేసుకుంటే ఇందులో సత్యం చాలవున్నది. మమ్మలను, అంటే రచయితలను, మన విద్యావిధానం— అది యిచ్చిన సమాజ దృక్పథం పూర్తిగా బలహీనులుగా, అనారోగ్యవంతులుగా మార్చేసింది. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రజలనించి దూరంచేసింది. మనదేశంలో సామ్యవాదం కోసం సాయుధంగా పోరాడుతున్న వాళ్ళు మొదలుకొని వాళ్ళకు సాయుధంగా అడ్డుపడుతున్న వాళ్ళవరకు అందరూ సామ్యవాదమే కోరుతున్నారు, పోనీ అట్లా చెప్తున్నారు. వీళ్ళలో నిజంగా సామ్యవాదం కోరే శక్తులు-సామ్యవాద దేశంలో చదువులు, సంస్కృతి ఎట్లా వుండాలో తీవ్రంగా ఆలోచించకపోతే రాజకీయంగా సాధించుకునేది సాంస్కృతికంగా పోగొట్టుకోడానికి ఎంతోకాలం పట్టదు. సోషలిస్టు సిద్ధాంతాలు వల్లించే మన అన్ని రాజకీయపార్టీల డొల్లతనం— ప్రజల్నించి దూరమైన వాటి ఆచరణరహిత అధ్యయన ఫలితమే. ఈ దృష్టితోనే మన యువతరాన్ని తన విద్యావిధానం యిపుడు ఎట్లా వున్నది? ఎట్లా వుండాల్నో నిర్ణయించుకోమ్మని యీ వేదికమీదికి ఆహ్వానిస్తున్నాం.

—సంపాదకుడు

## సామ్యవాద విద్య ఎట్లా వుండాలి? ఒక నమూనా

పాశ్చాత్య పెత్తనాన్నించి విద్యావిధానాన్ని విముక్తంచేసే ప్రయత్నం చేసిన ఆశియాలోని ఒకే ఒకదేశం చైనా. వలసపాలన అవశేషంగానే యింకావున్న విద్యావిధానాన్నే ఇండియాలో మనం కొనసాగిస్తున్నాం.

మన విద్యావిధానాన్ని మార్చటం గురించి మాటల్లో చాలా జరిగింది. కాని ఆచరణలో, మనదేశానికి పనికొచ్చే విద్యాపద్ధతిని నిర్మించుకోవటంలో ఏ ప్రయత్నమూ

జరగలేదు. కాని చైనాలో తమ విద్యా, సాంఘిక సమస్యలకు దేశీయ పరిష్కారం కనుగొనటానికి ప్రయత్నం జరిగింది. తగినంత జయప్రదమూ అయింది.

సాంస్కృతిక విప్లవం అనేది సాంప్రదాయాన్నీ పాత విలువలనూ బద్దలుగొట్టే ప్రయత్నం మాత్రమేకాదు: సామ్యవాద నిర్మాణానికి పరిస్థితులను సృష్టించటం కూడా. సాంఘిక ఆర్థిక రాజకీయ నిర్మాణంలో రష్యావంటి తదితర పాశ్చాత్య నమూనాల నొదిలి వేరుదారి తొక్కటాన్ని చూపుతుంది యీ సాంస్కృతిక విప్లవం.

పాత విద్యావిధానాన్ని వ్యతిరేకించటానికి మూడు కారణాలు— మొదటిది— పాత విద్యావిధానం భూస్వామ్య బూర్జువా దృక్పథాధీనమైనట్టిది.

రెండు— ఆ విధానంవల్ల కొందరు (అంటే చదువుకున్న వాళ్ళు) గొప్పవాళ్ళు అన్నట్లు (Elites) తయారవటం జరుగుతుంది

మూడు— డిగ్రీలు, సర్టిఫికేట్లు విద్యార్థి నిజమైన సామర్థ్యానికి కొలమానంగా వుండవు.

విద్యావిధానాన్ని పూర్తిగా పునర్‌నిర్మించారు. పాఠ్యాంశాలు, బోధన, పరీక్షాపద్ధతులు అన్నీ మార్చేశారు. విద్యను గురించిన మావో ఆలోచనను 1966 లో పార్టీకేంద్ర కమిటీ ఆమోదిస్తూ నిర్ణయించింది. ఆ తీర్మానంలోని 10 వ సూత్రం విద్యావిధాన మూలసూత్రాన్ని ప్రతిపాదించింది. అదేమంటే— "విద్య శ్రామికుల రాజకీయాలకు ఉపయోగపడాలి, సృజనాత్మక శ్రమతో జోడించబడాలి. అలా అయితే విద్యనభ్యసించే వాళ్ళు నైతికంగా, శారీరకంగా, తెలివితేటల్లో అభివృద్ధి అవుతారు. సామ్యవాద చైతన్యం, సంస్కృతిగల శ్రమజీవులవుతారు".

పట్టణానికి, పల్లెకువున్న తేడాలు, విద్యావంతులకూ విద్యలేనివారికీ వున్నభేదాలు మాసిపోవటం మావో అభీష్టం.

విద్యా సంస్థలలోనికి ప్రవేశార్హతలను మార్చివేశారు. రిచర్డ్‌హారిస్ యీమధ్యనే చైనా సందర్శించి వచ్చి చెప్పేదాన్నిబట్టి పెకింగ్ దగ్గరోని ట్సింఘా యూనివర్శిటీలోని విద్యార్థుల్లో నూటికి 45 మంది కార్మికులు, 40 మంది రైతులు, 15 మంది సైనికులు. తగినన్నిమార్లు చర్చలు జరిపి ఎక్కడికక్కడ ప్రజలే వీరిని ఎన్నికజేస్తారు. యూనివర్శిటీలో చేరేముందు వీరు కనీసం 3 సంవత్సరాలయినా ఫ్యాక్టరీలోనో పొలాల్లోనో, సైన్యంలోనో పనిచేశివుండాలి. రాజకీయ చురుకుదనం ముఖ్యమైన గుణంగా చూస్తారు. విద్యలో, ఆచరణకు పనికొచ్చే తర్ఫీదు, శారీరక శ్రమలకు ప్రాముఖ్యతనిస్తారు. సగం

పని సగం చదువు. స్కూళ్ళు క్రమంగా పెరిగిపోతున్నయ్. వీట్లలో చైనా రాజకీయ ఆర్థిక అభివృద్ధికితగినట్లు విద్య అందించబడుతోంది. విద్యావిషయాల్తోనే కలిపి ఉత్పత్తి జరుగుతోంది. కనుక ప్రభుత్వానికి తక్కువ ఖర్చుతో ఎక్కువ మందికి విద్య అందుతోంది.

మావోయిష్టు విద్యా సంస్కరణల్లో యింకోసంగతి. విద్యార్థులు పల్లెటూళ్ళకు వెళ్ళటాన్ని ప్రోత్సహించటం, రైతులదగ్గరకూడా చదువుకోటానికి "యువకులు పల్లెటూళ్ళకు వెళ్ళి పేద, మధ్యరకం రైతులవద్ద శిక్షణపొందటం అవుసరం' అని ప్రస్తుత బోధ.

ఈ విద్యా సంస్కరణలు పెట్టుకొన్న లక్ష్యాలను చేరుకోవటంలో జయప్రద మయినవా? మనకు చైనాగురించి తగినంత సమాచారం అందే అవకాశాలులేవు గనక నిర్ణయాత్మకంగా చెప్పటం కష్టం. అయినా మావో ఆధ్వర్యంలో విద్యాసంస్థలు చాలా విస్తరించి పాతవిధానంలో ఏకోశానా యూనివర్శిటీల్లో ప్రవేశించే అవకాశంలేక నిర్లక్ష్యం చేయబడిన పేదప్రజలు పైచదువుల కొస్తున్నారు.

చైనా విద్యా సంస్కరణలు వెనకబడ్డ దేశాలకు వర్తింపచేయటానికి ఏమైనా ఉపయోగపడతయ్యా? ఔను. పాశ్చాత్య విద్యకు ప్రతిగా యింకోదారిని చూపుతయ్ అవి. విద్యాస్థాయిని దెబ్బతీయకుండా పాశ్చాత్య సాంప్రదాయక విద్యావిధానాన్ని వెనకబడ్డ దేశాలకు అనువర్తించలేము. పెరుగుతున్న అవసరాల దృష్ట్యా వెనుకబడ్డ దేశాలకు నిపుణులయిన పనివారు ఎక్కువ అవుసరం అవుతారు. సమూహంగా ఎక్కువ మందిని విద్యాలయాల్లో చేర్చుకొన్నకొద్దీ రద్దీ ఎక్కువయి విశ్వవిద్యాలయ విద్య అనే ప్రత్యేకతే దెబ్బతింటుంది.

వెనకబడ్డ దేశాల్లో పాశ్చాత్యవిద్య, పైవర్గంలోకి చేరటానికి, శారీరకశ్రమ అనే "దుస్థితి" నుంచి తప్పించుకోటానికి దారిగానే వుంటుంది. ఈవిధంగా విద్యావంతులు తాము ఎవర్నించి వచ్చారో ఆ ప్రజాబాహుళ్యం నుంచి దూరం అవుతారు. తమదేశ వ్యవసాయిక సాంఘిక ఆర్థిక వాస్తవాలను అవగాహన చేసుకోలేరు. పాశ్చాత్య విద్యావిధానం పేదలకు వ్యతిరేకమైనది. ఎక్కువ ఫీజులు, ఖర్చులు, ఎంచి ఎంచి చేర్చుకోటాలూ సాంఘికంగా తక్కువ అవకాశాలుగల వారిని దెబ్బతీసేవే.

అందుకనే చైనా వుద్దేశం— సమూలమైన సామాజిక రాజకీయ విప్లవం లేకుండా విద్యాసంస్కరణ అసాధ్యమని.

సిద్ధాంతాల సంగతులేమైనా, చైనా అనుభవాలు యితరరకాల సమాజాలకు దేశాలకూ ఎంతవరకు ఉపయోగపడతవో ఆలోచించటం మంచిది.

( చైతన్య :
టైమ్స్ ఆఫ్ ఇండియా)

## చదువంటే ప్రజల్లోకి చొచ్చుకపోవడం

మహోన్నత శ్రామిక సాంస్కృతిక విప్లవానికి ముందు చైనాలో సాంకేతిక నైపుణ్యం, భావ ఔన్నత్యం, విప్లవ వ్యతిరేక రివిజనిజం గొప్పవని భావించిన విద్యావంతులు లేకపోలేదు. కాని 1968 లో రెడ్‌గార్డ్‌లు విశ్వవిద్యాలయాల్లో పేరుకపోయిన యీ రివిజనిజాన్ని ఒక తుఫానులా తుడిచేసిన తర్వాత సిద్ధాంత అధ్యయనంకన్న ప్రత్యక్ష శిక్షణ ఎంత ముఖ్యమో వాళ్లు గ్రహించిను.

పరీక్షల కోసం తయారుచేసే 'చెమ్చా' పద్ధతిని తుడిచేసి వికాసం కలిగించే వినూత్న పద్ధతిని ప్రవేశపెట్టిను. స్వాధ్యయనానికే ప్రాముఖ్యం. ముందుగా పాఠం నోట్స్ యిస్తరు. అవి వాళ్లు చదువుకొని చర్చించుకుంటరు. ప్రశ్నలేమైనవుంటే ఉపాధ్యాయులు, విద్యార్థులు కలిసి అధ్యయనం చేస్తరు.

ఒక్కొక్కప్పుడు విద్యార్థులు వేదికలెక్కి పాఠాలు చెప్తరు. సాంస్కృతిక విప్లవంకన్న పూర్వం నాయకులకు శిక్షణ యివ్వడమే విద్యావిధానం యొక్క ధ్యేయం. ఇప్పుడు ఏం నేర్పాలో్న నేర్చుకోడానికి ఉపాధ్యాయుడు ప్రజల దగ్గరికి పోతున్నాడు. విద్య యిప్పుడు ఆచరణకు సంబంధించిన విషయం. అంతేగాని ప్రజలను పాలితులుగా పాలకులుగా విడగొట్టి దూరంచేసే సాధనంకాదు.

విమర్శ – ఆత్మ విమర్శ అనే విధానాన్ని మనం బాగా ఉపయోగించాలె అని చైర్మన్ మావో చెప్పిన సూత్రాన్నిపాటించి పెకింగ్ విశ్వవిద్యాలయంలోని ప్రొఫెసర్లు ప్రజలనుంచి విమర్శను స్వీకరించి ఆత్మవిమర్శ చేసుకుంటున్నారు. ఫలితంగా ప్రజల్లో వాళ్లపట్ల గౌరవము, విశ్వాసము కలుగుతున్నయి.

రష్యాలో బళ్ళలో గొప్పోళ్ళ మనస్తత్వం వచ్చింది. అక్కడి పరీక్షావిధానం కూడ విప్లవ ప్రతిఘాతకంగా మారిపోయింది. మనిషికి మనిషికి, ఒకచోటుకు యింకో చోటుకు వ్యత్యాసాలు వుండొచ్చు. కాని ప్రజలను ఒకస్థాయికి చేర్చడానికి శిక్షణయిచ్చేటప్పుడు ఆచరణఅనేది నిర్ణయాత్మకంగా వుండాలె.

ఇవ్వాళ పెకింగ్ విశ్వవిద్యాలయంలో 40% ఫ్యాక్టరీల నుంచి, 40% కమ్యూన్ల నుంచి, 10% ప్రజావిమోచన సైన్యంనుంచి 10% మాత్రమే పెకింగ్ బ్యూరాక్రసీనుంచి వచ్చినవాళ్లు చదువుకుంటున్నరు. వీళ్ళు చదువుతోపాటు యునివర్సిటీ ఫ్యాక్టరీలలో పనిచేస్తరు. రేడియోలు, ఎలక్ట్రానిక్‌లు, మందులు వంటివి తయారుచేస్తరు.

(స్టేట్స్‌మన్ ఆధారంగా)

## ఇది విశ్వ శిథిలాలయం

ఇది విశ్వ శిధిలాలయం. ఇచట శవభాషలోనే ('గ్రాంధిక' మంటారు దీన్నే పండితమ్మన్యులు) జవాబు వ్రాయాలి. ఇది కుళ్ళిన శవం. పారెయ్యండి దీన్ని అంటే పూజిస్తారు. చెత్తరాసినా, ప్రాచీనం కాబట్టి బంగారమనే భావించబడుతుంది. నిజాని కిక్కడ ఎత్తుమడమల జోళ్ళు సవ్వడిచేస్తున్నా, 'ఝులం ఝులక్కటక సూచిత వేగ పదారవింద'లు చేస్తున్నశబ్దంగా మాత్రమే విన్పిస్తుంది. పద్యాన్నే కవిత్వమనుకొంటా రిక్కడ, అజ్ఞానం ఆశ్చర్యం కలిగించదు. పద్యాలారేసేది వృత్తిగా పెట్టుకొన్నవాణ్ణి కవి అంటారు. సచ్చిన 'కవుల' పద్యాలే యింకా యిక్కడ స్వైరవిహారం చేస్తాయి. పోయిన దశాబ్దంలో రాసిందేదీ ఇక్కడ పఠనయోగ్యం, ప్రామాణికం అన్పించుకోదు. మోతాదుకు మించి మానవత్వం ప్రదర్శింపబడుతుంది, నిదర్శనగా, కవి సచ్చినవెంటనే స్మారకంగా వాడు రాసింది పాఠ్యాంశం చేయబడుతుంది.

చెత్తంతా ప్రత్యేకంగా ఒకచోట సంగ్రహించడాన్నే యిక్కడ పాఠ్యపుస్తక మంటారు. తెలుగులో అయితే ఎవడు ఎక్కువ కఠినంగా రాసుంటాడో వాడి సోదె ఎక్కువుంటుంది. అందరికీ అర్థమయే భాషలో గొప్పగా రాసిన వేమనలాంటి వాళ్ళ నిక్కడ చదవరు. వేమన రాసినవి యిప్పటికీ పనికొస్తాయేమో అన్న అనుమానం కూడ వుండొచ్చు కొందరికి. శిథిలాలయంలో అది యిమడదు కనుక శిథిలం కానిదాన్ని క్కడ సామాన్యంగా గ్రహించరు. అం దు కే ఒక్క అభ్యుదయ కవితకూడా పాఠ్యాంశం కాదు.

మతం మత్తుతో కులం అమేధ్యం తిని కులాసాగా కాలం గడపడాన్నిక్కడ నాగరికత అని పిలుచుకొంటారు ముద్దుగా.

శిథిలాలయంలో చదవొచ్చినవారి కతకూడా యింతింత మాత్రమే వుంది. ఇంగ్లీ షోడి బూట్‌పాలిష్ చేసేదాంట్లో వుండే నైపుణ్యాన్నిబట్టి విద్యార్థి విలువను అంచనా

వేస్తారు. ఈ నైపుణ్యం ఎంతవరకూ సహజమై పోయిందంటే విజ్ఞానంలో వుపయోగించే సాంకేతిక పదాలన్నీ ఇంగ్లీషవే అన్నంతవరకూ పోయింది ఇదికూడా హద్దు కాదేమొ. అందుకే ఇంగ్లీషులోనే చదివేందుకు సదుపాయాలు కల్పించాలని నెర్రోజులు మొరపెట్టుకొన్నారు. (దీన్నే స్ట్రైకంటారు కాబోలు) 'పారను' పోవాలట. వీళ్ళకు ప్రపంచ పటంలో అమెరికా సంయుక్త రాష్ట్రాలూ, బ్రిటన్ కన్పిస్తాయి. అంతెందుకు? కొన్ని శిథిలాలయాలకు ద్వారపాలకులుగా వుంటున్నాయి అమెరికా సంయుక్తరాష్ట్రాల బ్రిటన్‌ల బోర్డులు. మరింకా గర్వించదగ్గ విషయమేమంటే వ్యవసాయ విశ్వ శిథిలాలయంలో యేసేది పి ఎల్ (పబ్లిక్ లా) 480, పండేది పి ఎల్ 480, కక్కేది పి ఎల్ 480.

సంవత్సరానికోసారి విశ్వ శిథిలాలయం జరుపుకొనే సామూహిక వేడుకను స్నాతక పతనోత్సవ మంటారు.

ఈ గుడ్లగూబల శిథిలాలయంలో స్మరణశక్తిపైనే ఆధారపడి కంఠస్థం చేసే వాళ్లది రాజ్యం. అర్థం చేసుకొంటున్నాం అర్థమయిందంతా రాయగలం. తెలుగులోనే చెప్పండి అనటం అవివేకం. ఇంగ్లీషుని ఐచ్ఛికం చేయండి. తెలుక్కి ఇంగ్లీషు కిచ్చినంత సమయం ఇవ్వండి అంటే, అదీ అవివేకమే. బానిసలదృష్టిలో సొంతంగా ఆలోచించడం అపరాధం. చీకట్లోనే శిథిలాలయం నవ్వుతుంది.

ఇది నిజమైన విశ్వ విద్యాలయంగా మారాలి. లేకపోతే దీనికి కొన్నేళ్ళ సెలవు ప్రకటించబడాలి.

విద్యార్థి వాహిని
తిరుపతి.

## మోదుగుపూలు - ఒక విచారం

మోదుగుపూలు నవల ఇతివృత్తం మంచిది.

ఈ రోజుకు, యింకా చాలానాళ్ళవరకూ కవులకూ కథా రచయితలకూ విప్లవకారులకూ చాలా సంగతులు చెప్పి బుర్రలకూ, కలాలకూ కత్తులకూ పదును పెట్టించగల కాలం అది, తెలంగాణం అది.

అటువంటి ప్రాంతాన్ని కాలాన్ని ఎన్నుకున్నందుకు రచయితను అభినందించాల్సిందే.

ఆ ప్రయత్నం సద్వినియోగం అయితే తెలుగు దేశానికి రచయిత ఎంతో ఉప యోగం చేశినట్లు. ఆ ప్రయత్నంలో కృషి సరైనదారిన నడవకపోతే అంతగానూ నష్టం చేయటం కూడాను. ఇందులో రచయిత నెగ్గలేకపోయారని నష్టం చేశారని నా విచారం.

అందుకు కారణాలు యివి—

1. ఇలాంటి ప్రయత్నం చేసే రచయిత ఆనాటి పరిస్థితుల్లో భాగస్వామి కాకున్నా, భాగస్వామి అన్నంత తాదాత్మ్యత పొందే ఫీలింగ్‌తో కూడిన సర్వసమగ్రి జ్ఞానం (ఆ పరిస్థితులు, జీవనం, ఉద్యమాలు) కల్గివుండాలి.

అలా రచయిత పొందలేదని, అసహజమైన వాతావరణ కల్పన, పాత్రల అస్వ భావికత నిరూపిస్తున్నయ్.

2 పేరుకోసమూ, మధ్యతరగతి యీజీ చదువరుల చప్పట్లకోసమూ రచయిత దృష్టిపెట్టుకున్నారు. లేకుంటే భాష తగినన్నిచోట్ల సీరియల్ కథల భాషరాదు.

3. వాస్తవికతకు అన్నిరకాలా ఎక్కువ అవకాశం యిచ్చి రాయగల్గితే ఆ పరి స్థితులను గొప్ప కథలుగా ఎన్నో రాయొచ్చు. అలాగాక రచయిత ప్లాటు వూహించి కొంత వాస్తవికతను కలిపి తనలోతనే కథ అల్లుకుపోయారు. Subjective కల్పనగానే పరిణమించింది.

గంగినేని 'ఎర్రజండాలు', వట్టికోట 'ప్రజల మనిషి', గొల్లపూడి నారాయణరావు 'పాతరోజులు' వంటి కథలూ నవలలూ యిదే విషయంగా వున్నయ్.

'ఎర్రజండాలు' వాస్తవాల రిపోర్టులు. కాని కథలకంటే గొప్పగా కవితామయం గావుండి, కరుణాక్రోధాలతో చదువరులను ఊపివేశినయ్.

'ప్రజల మనిషి' కథా, కల్పనే అయినా వాస్తవమే చెబుతున్నట్లు భావనకలగ జేసి ఆలోచింపచేశింది.

మోదుగుపూలు సంగతి భిన్నంగావుంది. మనదేశంతో సహా చాలా దేశాల్లో బూర్జువా కళాకారులూ, వ్యాపారులూ, మంచి మంచి విప్లవాత్మక ప్రజల ఇతివృత్తాలే తీసుకొని డబ్బూ పేరూ చేసుకుంటారు. బూర్జువాలు కాబట్టి థీమ్‌కి న్యాయం చేయలేరు. ఆ సీరియస్‌నెస్ నిజాయితీ వుండవు పేలవంగానో, వెకిలిగానో తయారవుతుంది. ఉదా॥ అమెరికాలో చేగువెరా సినిమాతీశారు. (డబ్బుకోసమే). ఇక్కడ N. T. రామా రావు వగైరాలతో కన్యాశుల్కం తీశారు. సినిమా. చాలా కథల్లో సినీపాటల్లో సామ్య వాదం విప్లవం వినిపింపచేస్తారు.

అలా ఉద్దేశపూర్వకంగా కాకపోవచ్చుకాని అటువంటి పద్ధతినే సాగింది యీ పుస్తకం కూడా. అదీ విచారకరం.

—ఎ. రంగారావు

సాహిత్య లేఖలు:

## విప్లవ సాహిత్యంపై ఖమ్మం పోలీసు జులుం !

నేను మొదటినుంచీ ఖమ్మంలో వి. ర. సం. సాహిత్యం సృజన ప్రభంజనం. మొదలగు విప్లవ పత్రికలను అమ్ముచుండేవాడిని సమయోచితంగా అడపా దడపా వి. ర. సం. పత్రికలలోని పుస్తకాలలోని వాక్యాలను కొన్నింటిని కొటేషన్లుగా తీసుకోని నా దుకాణం ముందు పోస్టర్లుగా ప్రదర్శించేవాణ్ణి. అవిధంగానే ఇటీవల బూటకపు ఎన్నికలు బహిష్కరించండి కరపత్రాలలోని కొన్ని వాక్యాలను తీసుకొని నా దుకాణం ఎదుటనే పోస్టర్లు అతికించి ప్రదర్శించాను గత నెలరోజులనుంచీ నా దుకాణం ముందు వుంటున్నవి గత నెల ది/24వ తారీకు రాత్రి సి. ఐ. డి. పోలీసులు నా దుకాణం లోకివచ్చి పోస్టర్లను, లే. ఎరుపు విప్లవం వర్ధిల్లాలి మొదలగు వి. ర. సం. సాహిత్యాన్ని అక్రమంగా లాక్కొని తీసుకవెళ్ళారు. తెల్లవారి ఉదయమె మళ్ళావచ్చి నన్ను పోలీసు స్టేషన్‌కు గుంజుకపోయారు. అక్కడ గదిలో పడవేసి నానాబండ బూతులు తిట్టారు. లాటీలతో వొళ్ళంతా కదుములుకట్టేటట్లు చావమోదారు. నోట్లోనుంచి రక్తం వొచ్చే పర్యంతం తెగకొట్టారు. బూట్లతో తన్నారు, నీకు ఏకవి అడ్డం వొస్తాడురా. వి. ర. సం. అంటే ఇదేరా మజాగావుందికదురా నీవు ఏ విప్లవ కవితో చెప్పుకుంటావో చెప్పుకోరా. నిన్ను అడవులకు తీసుకపోయి కాల్చేస్తాంరా, నీకు గతి ఎవ్వరురా అని ఎన్నోవిధాల బెదరిస్తూ పచ్చి బూతులుతిట్టారు. ఇంతేగాక నన్ను చూడటానికి వచ్చిన 14 ఏండ్ల బాలుడైన నా కొడుకునుకూడా గదిలోకి నెట్టి బండబూతులు తిడ్తూ రక్తం కారేటట్లు కొట్టారు, లంజకొడకా గింతలేవు నీవుకూడా ఎన్నికలు బహిష్కరించమని పోస్టర్లు రాస్తావురా అని బూట్లతో తన్నారు. మమ్మల్ని యిద్దరినీ అరోజు అల్లా పోలీసులు కస్టడీలో వుంచుకొని నానాహింసలు పెట్టారు. మళ్ళీకాని వి. ర. సం. పుస్తకాలుగాని పత్రికలుగాని అమ్మినట్లు తెలిస్తే నిన్ను బ్రతకనీయము తీసుకవెళ్ళి కాల్చేస్తాం. టీ దుకాణం పెట్టుకోని ఏడవక యీ వ్యవహారాలన్నీ ఎందుకు అని బెదరించారు. ఇదీ భావప్రకటనేనా స్వేచ్ఛా స్వాతంత్ర్యం సోషలిజం అనేబదులు, గాలికబుర్లు చెప్పుకుంటూ బ్రతుకుతున్న యీ ప్రజాస్వామ్య ప్రభుత్వం, మొన్న విప్లవ పుస్తకాలను రాసే వాండ్లనే కాకుండా పుస్తకాలను, జప్తుచేసి తీసుకపోవటం, పుస్తకాలను అమ్మేవాండ్లను కూడా. నానాహింసలు పెడ్తున్నదంటే, ఇది ఎలాంటి ప్రభుత్వమో తనను తానే విరూపించుకుంటున్నది, తన చర్యల ద్వారా.

ఈ ప్రజాసామ్య వ్యతిరేక అణచివేత చర్యలను, ఇకనైన కట్టిపెట్టాలె అని ప్రభుత్వాన్ని హెచ్చరిస్తు నిసలైన ప్రజాసామ్య ప్రియులందరూ యీ ప్రభుత్వముయొక్క దుర్మార్గ స్వభావానికి, వ్యతిరేకంగా ఎదురునిల్చి- మిలిటెంట్ పోరాటాలను తీయమని అభ్యర్థిస్తున్నాను.

—బి. వీరయ్య, ఖమ్మం.

## జాతుల / ప్రాంతీయ సమస్య

రిఫరెన్సు :— బంగ్లాదేశ్ - జాతుల సమస్య - ఒక పాఠకుని లేఖ— సృజన (మార్చి 72)

మనదేశ స్వాతంత్ర్యానికి ముందు ముస్లిం మత ప్రాతిపదికమీద 'పాకిస్తాన్' విడిపోడానికి "జాతులకుగల స్వయం నిర్ణయాధికారం" సూత్రం కూడ తోడ్పడిందట. మతం వెనక ధనికవర్గం ఉండీ అది తన ప్రయోజనాలకు దాన్ని వాడుకొంటుందని తెలియలేదు. ఇప్పుడు ఆ ముస్లిం జాతిలోనే మరొక సెక్షనుకు దోపిడీలో భాగం కావలసి వచ్చి, బెంగాలీభాష సంస్కృతిని ఆధారం చేసుకొని, మిలటరీ నియంతృత్వానికి వ్యతిరేకంగా పార్లమెంటరీ విధానంతో పోరాటంలో కొచ్చింది. మిలటరీ నియంతృత్వం కన్న బూర్జువా పార్లమెంటరీ విధానం అభివృద్ధికరమైనదనీ, బంగ్లా జాతికిగల స్వయం నిర్ణయ హక్కును సమర్థించాలన్నారు. బూర్జువా పార్లమెంటు విధానంలోకూడ దోపిడీ కొనసాగుతుందనీ, ఎన్నికల ద్వారా ఏర్పడిన మంత్రివర్గాలను ఏదోసాకుతో తొలగించవచ్చనీ, ప్రజల ఉద్యమాలను అణచడానికి మిలటరీని ఉపయోగిస్తారనీ— మనకు అనుభవంలోకి వచ్చినప్పటికీ అవన్నీ ప్రక్కకునెట్టి 'బంగ్లాదేశ్' విషయంలో తప్పు అంచనా వేస్తున్నారు. 'సెక్యులరిజం' కూడ దోపిడీకి ఉపయోగపడుతుందని అనుభవం చెబుతోంది.

కాందిశీకుల నడ్డంపెట్టుకొని 'బంగ్లాదేశ్'ను భారతసైన్యాలు (తెరవెనుక రష్యన్ల తోడ్పాటుతో) విముక్తం చేసినట్టు భారతీయ ప్రాంతాలకు మరెవరైనా బయటనుండి విముక్తంచేసి, దాన్ని నయావలసగానో, తమ పలుకుబడిక్రింద ఉండేదానిగానో చేసుకు నేందుకు ఆ ప్రాంతీయ జాతుల స్వయం నిర్ణయహక్కును సమర్థించితే ఏమౌతుంది?.... మళ్ళీ కొంతకాలంపోతే బంగ్లాదేశ్‌లోనే.... ఆంధ్రప్రదేశ్‌లోని ప్రత్యేక తెలంగాణా

ప్రాంతీయ సమస్యవంటిది రాదని చెప్పలేము. దాన్నిమళ్ళీ 'స్వయం నిర్ణయ హక్కు' సూత్రంతో ఎవరైనా, బలపరచినా ఆశ్చర్యపోనక్కరలేదు– అందులో మళ్ళీ ఒకజిల్లా మరొక జిల్లాను (ప్రాంతీయ) దోపిడీచేస్తే?।

తెలంగాణాకు హామీలనిచ్చిందీ వాటిని అమల్లో పెట్టకపోయినా, పదవిలో ఉంటే వాటిని గురించి పట్టించుకోనిదీ, మళ్ళీ పదవులకోసం వాటిని లేవనెత్తి తమ పాలనవల్ల ఏర్పడిన అసంతృప్తినీ అసమానతలను ఆధారం చేసుకొని పదవులకోసం ఉద్యమం నడిపి, పదవులు చేజిక్కించుకోడానికి రాజీపడేదీ అంతా ఆవర్గంలోని ముఠాలేనని తెల్సుకోవడం పోయి.... దానికేవో ప్రాంతీయ దోపిడీకి వ్యతిరేకమని; స్వయం నిర్ణయ హక్కని, సిద్ధాంత గందరగోళం కూడ జతచేస్తున్నారు.

పైన చెప్పినవన్నీ దోపిడీదారుల మధ్య పదవులకోసం, మార్కెట్లకోసం, పలుకుబడికోసం, జరిగే ఉద్యమాలు పోరాటాలు తప్ప సమాజ వ్యవస్థమారడానికి మాత్రంకాదు. స్థానిక ధనిక దోపిడీదార్లు తమ దోపిడీకి పోటీలేకుండా చేసుకోడానికి, పై ప్రాంతాలవాళ్ళు దోపిడీచేస్తున్నారని చూపించి, ప్రజలను పక్కదారులు పట్టిస్తున్నారు.

పీడిత ప్రజలైన రైతుల కార్మికుల సమస్యలను పోరాటాలను వదిలేసి, ప్రాంతీయ అసమానతలకు ఏ సమాజవ్యవస్థ కారణమో దాన్నివదిలేసి జాతీయ వినాదాల వెనక పోవడం దురదృష్టమే అవుతుంది ధనికవర్గ పార్టీ అయిన అవామీలీగ్‌కి, పశ్చిమ పాకిస్తాన్ ధనికవర్గ పాలకులకు మధ్య నడచిన పోరాటంలో అవామీలీగ్‌ను యుద్ధం ద్వారానైనా అధికారంలోకి తేవడం భారత ధనికవర్గ పాలకులకు (70 ధనిక కుటుంబాలకు) సరిపోవచ్చును– అల్లాగే దాన్ని సమర్థించడం, మద్దతు ఇవ్వడం నకిలీ మార్క్సిష్టులకు సరిగానే ఉంటుంది।

భాషా ప్రాతిపదికమీద ప్రత్యేక రాష్ట్రాలు ధనికవర్గ ప్రయోజనాలకు అనుకూలంగా, పాలనా యంత్రాంగాన్ని సాఫీగా నడపడానికి, పెట్టుబడులు కేంద్రీకరించడానికి, వాళ్ళ నాయకులచేతనే వాళ్ళను దోపిడీకి గురిచేయడానికి వీలుకలుగుతుంది. కాని వర్గదోపిడీని సరిగా అర్థం చేసుకున్నపుడు, రాష్ట్రాలు ఎంత విశాలమయితే శ్రామిక వర్గం యొక్క శక్తి అంత ఎక్కువగా ఉండి ఐక్యపోరాటాల ద్వారా దోపిడీ సంకెళ్లను తెంచుకోడానికి అది అంత ఎక్కువగా ఉపయోగిస్తుంది. అధికారభాష, తక్కినభాషల విషయంలో ఆ పాఠకుని అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. [కేంద్రంలో స్థానిక భాషలకు తగిన గుర్తింపులేదనే భావం నానాటికీ తీవ్రమౌతోంది. హిందీభాషా ఉన్మాద ఉద్యమం దానికి ప్రతిగా హిందీ వ్యతిరేకోన్మాదం ఉద్యమరూపం దాల్చింది".]

అందుచేత జాతులకుగాని, ప్రాంతాలకుగానీ ఉండే స్వయం నిర్ణయ హక్కు ఏ ఉద్దేశంతో ఏలక్ష్యంవైపు ఏవర్గ ప్రయోజనాలకోసం. ఏ సమాజ వ్యవస్థకోసం వినియోగించబడుతోందనే దానిమీద ఆధారపడి ఉండాలి. అది నిర్దిష్టంగా నిర్వచించి, ఆచరణలోకి తేగలిగినప్పుడే, అత్యంత ప్రజాస్వామికశక్తులైన శ్రామికవర్గాన్ని ఐక్యపరిచేదిగా ఉన్నపుడే. వర్గదోపిడీని నిర్మూలించినపుడే అటువంటి హక్కుకు సార్థకత ఉంటుంది. లేకపోతే ఒక దోపిడీవర్గం నుండి విముక్తిపొంది మరొక దోపిడీవర్గం చేతుల్లోపడ్డమే అవుతుంది.

—"ఒక పాఠకుడు"

విశాఖపట్నం. (10–3–1972)

## బిట్వీన్ ది లైన్స్

మిత్రుడు జైరామ్ లేఖను మార్చినెల సృజనలో ప్రచురించినారు, అందుకు అనుగుణ్యంగా——

సోవియట్ సమీక్ష నం. 3 (జనవరి 21 తేదీ) సంచికలో సోవియట్ రష్యా ప్రవదా రాజకీయ వ్యాఖ్యాత శ్రీ విక్టర్ మయెవ్స్కీ వ్రాసిన "జాతీయ విముక్తి ఉద్యమానికి ద్రోహం చేస్తున్న చైనా నాయకులు" అన్న వ్యాసం వుంది. ఈ వ్యాసమే 'సోవియట్ భూమి' నం. 2 జనవరి 1972 సంచికలో కూడా పడింది. ఆ తిట్టు వ్యాసములోనే ఒకసత్యం బయటపెట్టడం జరిగింది. చూడగోరుతాను. ఆ వ్యాసములోని ఐదవ పేరా ఈవిధంగా వున్నది.

"చైనా యేజెంట్లు తూర్పు పాకిస్తాన్‌లో రెచ్చగొట్టే. కవ్వించే చర్యలకు పూనుకున్నారు. "బెంగాలీ విప్లవకారులకు" అన్న ఒక లఘుపుస్తకాన్ని వారు పంచారు. ఇందులో "మావో, లిన్ పియావో రచనల్లోని భాగాలు" వున్నవి. "పంజాబీ (అంటే పశ్చిమ పాకిస్తాన్) భూస్వాములకు" వ్యతిరేకంగా పోరాడాలనే లాంటి విజ్ఞప్తులు ఈ పుస్తకములో వున్నవి. పాకిస్తాన్‌లోని చైనా అనుకూలవర్గాలకు గణనీయమైన ద్రవ్యసహాయం అందుతూ వచ్చింది. నిజానికి ఆ వర్గాలు తూర్పు పాకిస్తాన్ వ్యవహారాల్లో చైనా జోక్యానికి సాధనంగా ఉపయోగపడ్డాయి".

—జి. రామకృష్ణ

అనంతపూర్

# గోర్కీ

కె. వి. రమణారెడ్డి

మనుషులు ఒకరిలో ఒకరు ఆనందం అనుభవిస్తూ ఒకరికొకరు ఆకాశ తారగా ఒకరిమాట ఇంకొకరికి సంగీతప్రాయంగా వ్యవహరించే రోజొకటి వస్తుంది. స్వేచ్ఛాయుతులైన మనుషులు ఈ భూమిమీద చరిస్తారు, స్వేచ్ఛ మూలంగా ఘనులౌతారు. అసూయనుండీ దురాశనుండీ ప్రతి ఒక్కడి హృదయమూ బయటపడి నిర్మలమౌతుంది. అందుచేత మానవకోటి సమస్తం దుష్టభావాలకు దూరమౌతుంది, హేతుబుద్ధినుండి మనస్సును వేరుపరచేది ఏదీ ఉండదు. జీవితం యావత్తూ మానవుడికి మహోపచార మౌతుంది. అతని మూర్తి అత్యున్నతమైన శిఖరాలనందుకొంటుంది. స్వేచ్ఛాపరులకు అలివిగాని ఔన్నత్యాలే ఉండవు. మనం సత్యంగా స్వతంత్రంగా సుందరంగా జీవిస్తాం. ఎవరు ప్రపంచాన్ని తమ హృదయాలతోటి కౌగిలించుకొంటారో, ఎవరి ప్రజాభిమానం గాఢతరమో, వాళ్లే ఉత్తములుగా లెక్కకువస్తారు. ఎవరెక్కువ స్వేచ్ఛాయుతులో వాళ్లే ఉత్తమోత్తములు. వాళ్ళలో సౌందర్యం మరింత అధికంగా ఉంటుంది. జీవితం గొప్పగా ఉంటుంది. అలాంటి గొప్ప బతుకు బతికే ప్రజలుకూడా గొప్పగానే ఉంటారు.

అసాధ్యం అనిపించే ఆదర్శం ఇది. అబద్ధం అనిపించే కల్పన ఇది. గోర్కీ 'అమ్మ'లో ఆంద్రీ అనే విప్లవకారుడు ఆదర్శానికి రూపకల్పన చేశాడు. కలను అక్షరాలలో పెట్టాడు. నిజానికి, గోర్కీయే ఆంద్రీని ఆవేశించి మాట్లాడించాడు. తన నవలలోని ముఖ్యపాత్రలలా విప్లవాత్మక సామాజిక పరిణామానికి తానూ ప్రతినిధి అయ్యాడు, కాబట్టే అక్షరాలా చరితార్థుడయ్యాడు.

## 2

1936 లో గోర్కీ మరణించినప్పుడు, లెనిన్ మరణం తర్వాత సోవియట్ యూనియన్ జీవితంలో గోర్కీ మరణమే ప్రధానమైన, విచారకరమైన దుర్ఘటన అని సోవియట్ మంత్రిమండలి పక్షాన మొలటోవ్ అన్నాడు. నిజంకూడా అంతే.

'మకర్ చుద్రా' అనే కథతోటి గోర్కీకి లభించిన ప్రసిద్ధి అమరణాంతం తరుగనేదిలేకుండా ఉండిపోయింది. జీవితం యొక్కట్లు తెలిసిన రచయితలకే కరువుగా ఉండేది. అది ఇప్పుడు తీరింది. శ్రామికవర్గం నుంచి పైకి రాసాగిన కొత్త మేధావులు చెహావ్ అడుగుజాడల నుంచి తప్పుకొని లోకంగురించి మరింత విభ్రతమైన వైఖరిని అవలంబిస్తున్నారు. సంస్కరణలవల్ల లాభంలేదని గ్రహించి విప్లవంగురించి తీవ్రంగా ఆలోచిస్తున్నారు. తామే దానికి దారితీస్తున్నారు. ఇది సరికొత్త చారిత్రక దశ. రష్యా రాజధానిలోనేగాక రాష్ట్రాలలోకూడాగాలి మారింది. గోర్కీ కథలు ఒకొక్కటీ ఈ గ్రామీణ రైతుల, రేవు పట్నాల కూలినాలి మనుషుల, తిరుగుబోతుల, హృదయాన్ని ఒక్కొక కోణంగా పట్టిస్తున్నాయి. టాల్‌స్టాయి, చెహావ్‌వంటి సుప్రసిద్ధ రచయితలుకూడా కళ్ళు నులుపుకొని, గోర్కీవంక ఆశ్చర్యంగా చూసేరోజు వచ్చింది. అయితే అతడు జైలు లోపలికీ వెలుపలికీ పోతూ వస్తుండవలసి వచ్చింది.

మార్క్సిజం లెనినిజంగా మార్పుచెందుతున్నది. అరువుతెచ్చి పెట్టుకొన్న నగ లాంటి పెట్టుబడిదారీ పద్ధతి జారిస్టు సమాజానికి వెల్లవెయ్యలేక పోతున్నది. సమ్మెలు వెల్లువకడుతున్నాయి. శ్రామికవర్గం లేచింది, కదిలింది. పాలకులూ పాలితులూ విప్లవ పరిస్థితిలో. తుఫాను గాలిలోని ఆకులా, సంచలింపసాగారు అకాడెమీ గౌరవ సభ్యత్వా ల్లాంటివికూడా గోర్కీలోని ఈ విప్లవాగ్నిని చల్లార్చలేదు. 1905 విప్లవంలో ఒకమహా ప్రదర్శనలో తానుకూడా కలిసినడిచి, ఆరోజున జరిగిన రక్తపాతం గురించి ప్రపంచ ప్రజలకు విజ్ఞప్తిచేశాడు. గోర్కీ ఒకశక్తిగా మారాడు. ఫలితం, చెరసాల, ప్రవాసం. ఆ ప్రవాసంలోనే లెనిన్ పరిచయం తొలిసారిగా గోర్కీకి కలిగింది. శ్రామిక ప్రజా సంస్కృతికి మహోజ్జ్వలమైన ప్రతినిధిగా గోర్కీని లెనిన్ ఆమరణాంతం గౌరవించాడు, దగ్గరగా తీసుకొన్నాడు, గురువేగాక మిత్రుడూ అయ్యాడు అయితే గోర్కీ 1917 విప్లవంలోకూడా బోల్షివిక్ కాలేదు. మొదట మెన్షివిక్ పార్టీకి సన్నిహితుడుగా ఉంటూవచ్చాడు. విప్లవానంతరం పార్టీకక్షలు ప్రబలినప్పుడు, సోషలిస్టు రివల్యూషనరీ పార్టీకిచెందిన అనేక ప్రముఖవ్యక్తుల ప్రాణాలను తీయకుండా ఎప్పటికప్పుడు లెనిన్‌కు నచ్చజెప్పి అడ్డుపడుతూ వుండేవాడు. అదేవిధంగా, విప్లవ సంరంభంలో ప్రాచీన సంస్కృతికి చెందిన కళాఖండాల రక్షణ విషయంలోనూ లెనిన్‌ద్వారా కృతార్థుడయ్యాడు. లెనిన్ పోయాక, స్టాలిన్ హయాములో సాంస్కృతిక వ్యవహారాలకు అనధికార మంత్రి అయినట్లుగా అనేక ప్రచురణాలయాలను స్థాపింపజేశాడు. అనేక చారిత్రక గ్రంథాలను రచింపజేశాడు. అనేక యువరచయితలను దగ్గరకుతీసి ప్రోత్సహించాడు. 'యూనియన్

ఆఫ్ సోవియట్ రైటర్స్'ను స్థాపింపజేశాడు. 'సోషలిస్ట్ రియలిజమ్' అనే సాహిత్య ధోరణికి శ్రీకారం చుట్టాడు. తాను ఒక మహాసంస్థ అయ్యాడు.

3

వ్యక్తిగానూ రచయితగానూ గోర్కీ విప్లవవాది. అయినా ఆ విప్లవవాదం కాల్పనికతతో ముడిబడి ఉంది. వాస్తవ చిత్రణకు కల్పనాబలాన్ని జోడించి కథలూ నాటకాలూ నవలలూ అనేకం రాశాడు. ఉన్నది ఉన్నట్టుగా జీవితాన్ని ప్రతిబింబించే సాహిత్యవైఖరేగాక, ఉన్నదాన్ని విమర్శిస్తూ వాస్తవాన్ని చైతన్యయుతంగా చిత్రించే వైఖరికూడా గోర్కీకి సరిపడలేదు. తన వెనకటితరం రచయితలనూ సమకాలిక రచయితలనూ గౌరవించి ప్రేమించినంతమాత్రాన, గోర్కీ గతానుగతికంగా రాస్తూపోయినట్టుకాదు. కొత్తతోవ తొక్కి రాగలతరానికి మార్గాన్ని నిర్దేశించాడు. చెహావ్‌కు రాసిన ఒక లేఖలో "జీవితంలో వీరోచిత కార్యాలకు జాగా ఉంది" అన్నాడంటే, చెహావ్ చిత్రణ, పాత్రీకరణల గురించి తిరుగుబాటు లేవదీశాడనుకోవాలి.

చెహావ్ పాత్రలు ఎక్కడో తప్ప గుండెదిటవుగానీ చొరవగానీ లేని అల్ప జీవులు. చట్టానికీ వ్యవస్థకీలోబడి పైకిలేచి ఎదురుతిరగలేని అసమర్థులు. నిరాశనూ నిస్పృహనూ పటాపంచలుచేసి, పంజరాలనూ బోనులనూ విరగదన్ని, ఇరుకు మురికి గదులూ పిరికి ఎదలూ వెనకవిడిచి గర్జించే గాండ్రించే నడివీధుల్లోకి రాజాలని అశక్తులు ఇలాంటి విష్పల వాతావరణం నుంచీ విషాదచ్ఛాయనుంచీ రష్యన్ సాహిత్యానికి విడుదల కలిగించి, చారిత్రిక ఆశామయ వైఖరినీ, పోరాటపంథానీ, విప్లవాదర్శాన్నీ చూపెట్టిన రచయిత గోర్కీ.

ఆత్మవిశ్వాసంతో క్రియా పాటవంతో తొడగొట్టి సవాల్‌చేసే పద్ధతిలో గోర్కీ రచన సాగించాడు. తిరుగుబోతుల నుంచీ నిరుపేదల నుంచీ సంఘ బహిష్కృతుల నుంచీ తన పాత్రలను ఎంపిక చేసుకొన్నాడు. "పందుల పాక"లాంటి రష్యన్ సమాజాన్ని. దాని అక్రమాలనూ దురాచారాలనూ, మోసాన్నీ ఘాతుకాన్నీ. క్రౌర్యాన్నీ నైచ్యాన్నీ, మూర్ఖతనీ మూఢతనీ, చాలా శక్తిమంతంగా గాఢవర్ణాలతో చిత్రించి ఎండగట్టివేశాడు. విప్లవవాదిగానే ఉండిపోక. విప్లవకారులలో తాను ఒకడయ్యాడు. మేల్కొన్న శ్రామికుల చేతికి అతని సాహిత్యం ఆయుధంగా అందివచ్చింది.

'ఫోమా గోర్డయేవ్' (1899). 'దిత్రీ', 'మదర్' (1907-8). 'ది క్రానికల్ ఆఫ్ ది టౌన్ ఒకురోఫ్' (1909-11) వంటి నవలలు రష్యన్ సాంఘిక జీవితం ఒక

దశనుంచి మరొక దశకు ఎలా మార్పుచెందిందో చూపెట్టడానికి సాహిత్య సాక్ష్యాన్ని చూపెడుతాయి. విప్లవానంతర కాలంలో 'ది లైఫ్ ఆఫ్ క్లిమ్ సంగిన్', 'ది అర్టమనోఫ్ బిజినెస్' వంటి నవలలు కూడా విప్లవానికి ముందు రష్యన్ సమాజంలో- ముఖ్యంగా మధ్య తరగతిలో- ఎలాంటి భావసంచలనం కలిగిందీ, పనిపాటల వాళ్లెలా గడితేరి రాసాగిందీ చూపుతాయి. గోర్కీ సాహిత్యం ఏకకాలంలో రెండు యుగాల, రెండు వ్యవస్థల, సంఘర్షణను ప్రదర్శిస్తుంది.

"పాతవ్యవస్థ మరి అక్కర్లేదని కింది తరగతుల వాళ్ళూ, పాతవ్యవస్థను మరి నిలబెట్టలేమని పై తరగతుల వాళ్ళూ ఎప్పుడైతే గట్టిగా అనుకొంటారో అప్పుడే విప్లవం విజయవంత మౌతుంది", అన్నాడు లెనిన్. పీడించేవాళ్ళూ పీడితులూ, అంటే మొత్తం జాతి, ఒకఘోర ప్రతిష్టంభనకు లోబడినప్పుడేగాని విప్లవం సాధ్యంకాదని తానే వివరించి చెప్పాడు. ఈ విప్లవకర ప్రతిష్టంభన వ్యాపించిన కాలాన్నే గోర్కీ సాహిత్యం కథాకాలంగా స్వీకరించింది. దీనికిగల అన్నికోణాలనూ గోర్కీ తన రచనలలో వర్ణించాడు. పరిశ్రమా కార్మికులలోనూ రైతాంగంలోనూ విప్లవోద్యమం వ్యాపించడం, మధ్యతరగతి పై అంతస్థుకూ కింది అంతస్థుకూ చెందినవాళ్లుగానీ బుద్ధిజీవులుగానీ పాతపద్ధతులను కొనసాగించలేకా కొత్తపద్ధతులను చేబట్టలేకా కొట్టుమిట్టాడడం—ఇవన్నీ గోర్కీకి సాహిత్యవస్తువుగా పనికివచ్చాయి. సమాజంలోని ప్రతివర్గం తాలూకు పరిణామక్రమాన్ని చిత్రించబట్టి విప్లవానికి ముందటి రష్యన్ సమాజచరిత్ర యావత్తూ అతని రచనలలో లభిస్తుంది.

వర్గాల పెనుగులాట వ్యక్తుల జీవితాలను కలచివేసే ఘట్టాలను గోర్కీ ప్రయత్నపూర్వకంగా ఎన్నుకొంటాడు. మనిషిని ఏకాకిగా కాకుండా ఏదో ఒకవర్గానికి చెందినవాడుగా చూపెట్టినప్పుడు, అతగాడి వైయక్తిక లక్షణాలుకూడా సామాజిక స్వభావాన్ని పొందుతాయి. వర్గ విలక్షణత్వం వ్యక్తి విలక్షణత్వంతో జోడు కూడుతుంది. ప్రతి సంఘర్షణా ఆ వ్యక్తిదిగానేకాక మొత్తం సమాజానిదిగా కూడా మారుతుంది. శతాబ్దాల తరబడీ ఉంటూన్న భూదాస్యాన్ని (Serfdom) రద్దుచేసే శాసనాలు వెలువడినా, అది ఇంకా జీవితంలోనూ మనస్సుల్లోనూ మిగిలే ఉన్నప్పుడు, దానిమీద పెట్టుబడిదారీ విధానాన్ని సహజ క్రమంలోగాక అడాటున కృత్రిమంగా మోపినప్పుడు, భూస్వాములకూ వర్తకులకూ, పరిశ్రమల యజమానులకూ కూలీలకూ, రైతులకూ వర్తకులకూ, రైతులకూ కూలీలకూ, పాతా కొత్తా వర్గాలకు నిరంతరం సాగుతూవచ్చిన సంఘర్షణ, సమాజంలో

అల్లకల్లోలం, భావాల్లో అలజడీ ఆందోళనా— ఇవి అనివార్యంగా విప్లవానికి దారితీశాయి. గోర్కీ రచనలన్నిటినీ కలిపే ఏకైక చారిత్రికబంధం ఈ విప్లవపరిస్థితే.

శ్రామిక మహోద్యమంతోటి తనకు యథార్థమైన సంబంధం ఏర్పడేంతవరకూ, గోర్కీ రచనలలోని నాయక పాత్రలు వీరభద్రుడిలా విధ్వంసాత్మకంగానే ప్రవర్తిస్తాయి తప్ప, వాటికి సరైన ముందుచూపు ఉండదు. దుస్సాహసం దురంతానికే దారి తీస్తుందని ఆటుతర్వాతనే గోర్కీ గ్రహించాడు. జడప్రాయంగా ఉన్న రైతాంగాన్ని మేల్కొల్పి పోరాటపంథా పట్టించేందుకు నరోద్నిక్ ఉద్యమం చేసిన కృషిని గుర్తించినా, నరోద్నిక్ భావాలుగల కుర్రవాళ్లు మిగతా జనంనుంచి ఎలా వేరుపడి ఒంటరిగా పోవలసివచ్చిందో గమనించాడు. కార్మికోద్యమం ప్రారంభమయ్యాక, 'చట్టబద్ధమైన మార్క్సిజం' ఎలా వర్గద్రోహంగా పరిణమించిందో చూశాడు. మృత్యు ముఖానపడిన బూర్జువావర్గంలో క్షీణభావాలు ఎలా వ్యాపించాయో పరిశీలించాడు. జీవితం చట్టుబండలౌతున్నా జనం కదలనేరక మెదలనేరక ఊబిలో వనవరంలాగా పడి ఉన్నారు. బతుకుతున్నారనేగాక, మొద్దుల్లా ఎద్దుల్లా బతుకుతున్నారు. ఎవరికి వారే ననుకొంటున్నారు. దేవుడిమీద కర్మమీద భారం మోపుతున్నారు. సమిష్టిగురించి స్పృహే లేకుండా వచ్చింది. ఈ నిశ్చేతత్వంలో కదలిక వచ్చినప్పుడు, అది మామూలుగా మందంగా సాగిపోదు. అది జగత్ప్రళయం కాకతప్పదు.

మనుషుల బతుకుల్లో భావాల్లో రాసాగిన మార్పు గోర్కీ రచనలలో ప్రతిబింబించింది. దాన్ని మనిషిపరంగా మనస్సుపరంగానే గోర్కీ వర్ణించాడు సుఖదుఃఖాలు, మంచిచెడ్డలు, ఆశనిరాశలు, జయాపజయాలు— ఇవన్నీ వ్యక్తులకు చెందినవిగానే వర్ణించాడు. అయితే ఈ వైయక్తిక పరిణామాలన్నీ సాంఘిక పరిణామానికి లోబడి ఉండక తప్పదని తనకు తెలుసు. మనిషికి ఎలా సుస్థితినీ సుఖాన్నీ కలిగించడమో తెలుసు. కాబట్టే తాను శ్రామిక మానవతావాది కాగలిగాడు రష్యన్ పెట్టుబడిదారీ విధానమనే సమిష్టి గోరీ నుంచి మనిషిని పునరుజ్జీవింప జెయ్యాలనేదే అతని ధ్యేయం. కన్నీళ్ళు చిలికించడం తన పనికాదు కనికరం బోధించడం తన ధర్మంకాదు. అది బూర్జువా మానవతావాదులకు— అంటే వట్టి హృదయవాదులకు— విడిచిపెట్టి తాను అక్షరాలనుఆయుధాలు చేసుకొని అక్రమాలమీద తిరగబడ్డాడు. అసమర్థతని గర్హించాడు అధికారాన్నిఎదిరించాడు. అనాథులకు త్రాణ కల్పించాడు. రచనని రణరంగం చేశాడు. మనిషికి ఆత్మప్రబోధం కలిగించి ఆత్మవిశ్వాసాన్ని నేర్పాడు. వర్గచైతన్యం కలిగినప్పుడు తమ విడి విడి దుఃఖాలనూ క్రోధాలనూ అవమానాలనూ వ్యక్తులు ఎలా భయంకరమైన ఉప్పెనగా మార్చగలరో

చూపాడు. బాధల మూలాలను చూసి మానవీయ సమస్యలకు అత్యున్నతమైన కళా రూపాలను కల్పించాడు. ఈ పీడితులతో, జీవితం తాలూకు పతితబిడ్డలతో తానూ మమేక మయ్యాడు. అపారమైన తన జీవితానుభవం నుంచి సాదామనుషుం గురించి నిష్ఠుర మైన నిజాన్ని పిండాడు. ఈ తరంగంలో తానూ ఒకబిందువే. కఠిన జీవితతలాన్ని బద్దలుచేసుకొని మేలైన విత్తుల్లాగా మంచి మనుషులు పుట్టుకురాగలరని నమ్మాడు. భ్రమల పాలుగాని ఆశావాదం గోర్కీది. ముందెప్పుడో ఒకనాడు వాస్తవం కాగల కోరిక కాదిది. ఇప్పటికిప్పుడే ప్రతి ఒక్కరూ వాస్తవీకరించుకోవలసిన కోరిక ప్రతి అడుగూ ముందడుగే అవుతుంది. మనిషిముందు రెండుదారులు లేవు. ఉన్నది ఒకేదారి అది విప్లవమే. గోర్కీ శ్రామిక మానవతావాదానికి విప్లవమే పతాకస్థాయి.

విప్లవానంతర కాలంలో 'సోషలిస్టు రియలిజమ్' అనే కొత్తసాహిత్య వైఖరిని గోర్కీ స్థాపించాడు. సోషలిస్టు ఆదర్శాన్ని నిత్యజీవిత సత్యంగా మార్చుకొంటూ, శ్రమే గౌరవకరంగా, శక్తే మూలధనంగా కొత్తసాంఘిక వ్యవస్థను నిర్మించే మనిషి మహావీరుడౌతాడు. వ్యక్తికోసం సంఘం, సంఘంకోసం వ్యక్తి. వెనకటి అవలక్షణాలు ఒకటొక్కటిగా రాలిపడుతూ మనస్సు శుభ్రతరం, ఆరోగ్యవంతం అవుతుంది. మానవ ప్రకృతిలో రుణాంశకు బదులు ధనాంశ ఆధిక్యాన్ని పొందుతుంది. ఈ సామాజిక, వైయక్తిక వాస్తవాన్ని చిత్రించేదే సోషలిస్టు రియలిస్టు సాహిత్యం. దీన్ని యువరచయిత లకు ఒంటబట్టిస్తూ సలహాలిస్తూ ప్రోత్సహిస్తూ శేషజీవితం గడిపాడు గోర్కీ. రొమాం రోలాం, హెన్రీ బార్బూజ్, హెచ్. జి. వెల్స్, హెన్రికమేన్‌లాంటి విదేశ రచయితల మీదకూడా తన ప్రభావాన్ని ప్రసరింపజేశాడు. విశ్వ రచయితలలో ధ్వజస్తంభంలా నిలిచాడు.

"మనిషి– ఈశబ్దం ఎంత ఘనంగా వినిపిస్తుంది!' అని గోర్కీ పాత్ర ఒకటి "ది లోవర్ డెప్త్స్"లో అంటుంది. ఆ మనిషి అట్టడుగున ఉండి ఆకాశంవైపు చూపు సారించి అటువైపు పట్టుదలతో ముందడుగూ పై అడుగూ వెయ్యడమే గోర్కీ జీవితం లోనూ సాహిత్యంలోనూ, వ్యక్తిగానూ రచయితగానూ, కనిపిస్తుంది.

"తలెత్తుకు, దర్పం స్వాతంత్ర్యం మూర్తికట్టిన విధంగా, మనిషి మునుసాగుతున్నాడు. నెమ్మదిగా నడుస్తున్నాడనేగాని ధీమాగా నడుస్తున్నాడు. ఛాందసాభిప్రాయాల ధూళి అతని కాళ్ళముందు నలుగుతూంది. పొరబాట్లు, దౌర్బల్యాల మసక మంచులోనుంచి తట్టుకొంటూ తడుముకొంటూ ఒంటరిగా

పోతున్నాడు. అతనివెనక, గతకాలం తాలూకు మబ్బులు ముసురుకొంటూంటే, ముందరేమో తీవ్ర సమస్యలు ఉచ్చులు పన్నుతున్నాయి.

"ఆకాశంలో మందంగా మెరిసే శతకోటి నక్షత్రాల్లా, అతని సమస్యలు అగణ్యమైనవి. కాని అతని ప్రస్థానానికి అంతేలేదు.

"ఈ కుదురుబాటులేని జీవి, ఈ మ ని షి, అభ్యుదయ పథానపడి ముందుకుపోతూనే ఉంటాడు..."

ఆ మనిషికి పరాజయమే ఉండదు. తననీ ప్రకృతినీ ఎప్పటికప్పుడు అర్థం చేసుకోవడంలోనే ఉంది అతని ప్రజ్ఞ. జీవితం కటికదైనా, కఠిన మైనా, అతడు తన దిగంతాలని నిరంతంగా విస్తరించుకొంటూనే పోతాడు. మనిషి ప్రపంచాన్నే మార్చివెయ్యగలడు.

---

"త్యాగం చేయండని ప్రజలకి బోధించడం వట్టి దగా. సామాన్య ప్రజ త్యాగం చెయ్యాల్సిందేముంది, ప్రాణాలు దక్క! అందర్నీ త్యాగం చేయమని 'నా కాయుష్యం-నా కారోగ్యం' అనుకుంటూందే పెద్దల్నేగాక కిమ్మనకుండా సర్వం త్యాగం చేసేవాళ్లని కూడా మనం చూస్తాం. ప్రజలకి తెలుసు యెవరి ననుసరించాలో."

—గోర్కీ